అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము, 7.

శ్రీ చెలికాని లచ్చారావుగారు,
(సంపాదకులు.)

# సారంగధరచరిత్రము.

చిమంచి తిమ్మకవిప్రణీతము.

# శతకముల ప్రథమ సంపుటము

## దీని వెల రు 2—8—0 మాత్రమే.

ఈ సంపుటము నందుఁ గల శతకముల పేర్లు.

| | | | |
|---|---|---|---|
| 1 | కాళహస్తీశ్వరశతకము | (ధూర్జటికవి) | 0—3—0 |
| 2 | భాస్కరశతకము | (మారదవెంకయ్య) | 0—3—0 |
| 3 | సీతాపతిశతకము | (సాహెబురాణి రామనకవి) | 0—3—0 |
| 4 | శ్రీరామలింగేశ్వరశతకము | (అడిదము సూరకవి) | 0—3—0 |
| 5 | కుక్కుటేశ్వరశతకము | (కూచిమంచితిమ్మకవి) | 0—3—0 |
| 6 | దేవకీనందనశతకము | (వెన్నెలకంటి జన్నయ) | 0—3—0 |
| 7 | కవిచౌడప్పశతకము | (చౌడప్పకవి) | 0—2—0 |
| 8 | నృసింహశతకము | (శేషప్పకవి) | 0—3—0 |
| 9 | ఇందుశతకము | (పుసులూరి సోమరాజామాత్యకవి) | 0—4—0 |
| 10 | నమశ్శివాయశతకము | (చామర్తి శేషగిరికవి) | 0—1—0 |
| 11 | మహిజామనోహరశతకము | (రేమళ్ల రామదాసు) | 0—2—0 |
| 12 | వరాహలక్ష్మీనరసింహశతకము | (గోగులపాటి కూర్మదాసు) | 3—0 |
| 13 | దాశరథీశతకము | (కంచెర్ల గోపకవి) | 0—2—0 |
| 14 | జగన్నాయకశతకము | (వరాహగిరి కొండాప్రెగడామాత్యుఁడు) | 0—2—0 |
| 15 | ప్రసన్నరాఘవశతకము | (నరసింహకవి) | 0—2—0 |
| 16 | లావణ్యశతకము | (పోలిపెద్ది వేంకటరాయకవి) | 0—2—0 |
| 17 | నారాయణశతకము | (బమ్మెర పోతరాజు) | 0—3—0 |
| 18 | ఆంజనేయశతకము | (చల్లాకోటయ్యకవి) | 0—3—0 |
| 19 | ప్రసన్నాంజనేయశతకము | (చిత్తూరిపరకవి నారసింహుఁడు) | 0—4—0 |
| 20 | సచ్చిదానందరామశతకము | (మండలేముల వెంకయార్యుఁడు) | 0—1—0 |

వలయువారు:—కార్యదర్శి.

చిత్రాడ;

సీతాపురంపోస్టు, గోదావరిజిల్లా.

అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము, 7.

# సారంగధరచరిత్రము.



ఇయ్యది

కూచిమంచి తిమ్మకవివర్యునిచే

రచియింపఁబడి

శ్రీ చెలికాని లచ్చారావుగారిచే

సంపాదింపఁబడినది.



చిత్రాడ:

శ్రీ రామవిలాసముద్రాక్షరశాల న్ముద్రితము.

1921.

చందాదారులకు రు. 0—8—0] [ఇతరులకు రు. 0—12—0.

ఆ చేమకూర అప్పన్న గ్రంథము ననుసరించి వ్రాసితిననెను. ఈ యప్పన వేంకటకవికి మారుపేరో, లేక యతఁడు మఱియొక సారంగధరచరిత్రము వ్రాసెనో పరిశీలింపవలసి యున్నది.

(3) రెండవ ద్విపద పరశురామకృతము కావలెను. గ్రంథము సరిగ లేదు. ద్విపదకావ్యకర్తల కాలము సరిగ దెలియదు. మూఁడవ రెండవ ద్విపద లొకటియా రెండా విచార్యము.

ఈతిమ్మకవి ఆరువేలనియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. బయ్యనామాత్యుని ప్రపౌత్రుఁడు, తిమ్మయ్య పౌత్రుఁడు, గంగనమంత్రి పుత్రుఁడు. తల్లి లక్ష్మమ్మ. సింగన్న, జగ్గన్న, సూరన్నాదు లీతని సహోదరులు. ఈతఁడు గోదావరిమండలములో పీఠికాపురసంస్థానమునం దుండు కందరాడగ్రామ కరణము. ఈతని కాలములో నాంగ్లేయులకును పరాసులకును తఱుచు యుద్ధములు జరుగుచుండుటయు, నా గ్రామసమీపమునుండియే సేనలు తఱుచు రాకపోకలు జరుగుచుండుటచేతను, వారలకు మార్గసౌకర్యాదులు చేయుటయు నా సేనలు దాడులకు వెఱచియు యాతఁడా గ్రామమును వదలి చంద్రంపాలెము వాసస్థలముగా నేర్పఱచుకొనియున్నట్లు నిప్పటికిని చంద్రంపాలెములోనున్న నాతని వంశజులు చెప్పుచున్నారు. ముస్సి కవియున్న కందరాడవద్ద నివేశనస్థలము పాడుదిబ్బగా చూపఁబడుచున్నది. ఈగ్రామము పెద్దాపుర పీఠికాపుర మార్గమున ఫకీర్దిపాలెమువద్ద చూడనగును. "ఈయన గ్రంథంబులు చేయ నారంభించిన కాలమునందు పీఠికాపురసంస్థానమున రావు మాధవరాయన్నపతి ప్రభువుగానుండెను." అని రావుబహద్దరు కం॥ వీ॥ పంతులుగారు వ్రాసియుండిరి. ఈయన యభిప్రాయప్రకార మన్నదమ్ములైన మాధవరావు, నీలాద్రిరావులలో నీమాధవరావుని ప్రభువుగాఁ దలంచియుండిరి. ఇందులకు రుక్మిణీపరిణయ, రసికజనమనోభిరామాదులనుండి యుదాహరణములు చూపిరి. ఈయన వారి నప్పటిప్రభువులుగా భ్రమపడి చూపియుండిరి. ఈయనకాలమునాఁటి పెదమాధవరావు మాత్రమే పట్టప్రభువై యుండెను. ఈయన చూపిన చినమాధవరావుమాత్రము ప్రభువుకాడు. కవి యించుమించుగా డెబ్బదిసంవత్సరములు జీవించియున్నట్లును 1757 సం॥లో మృతినొందినట్లును కం॥ వీ॥ గారు చెప్పుచున్నారు.| అప్పటికి మాధవరావుగారును నీలాద్రిరావుగారును వీరుభయులును రాజులు కారు. ఈతనికి 'కవిసార్వభౌమ' బిరుదు నొసంగినయాతఁడు పెదమాధవరావుగారే యైయుండు. ఈతఁడే వక్కలంక వీరభద్రకవివద్ద వాసవదత్తా పరిణయంబుఁ గృతినొందెను. ఈకవులిరువురు సమకాలికులైనట్లును దేఁదులూరి లింగనారాధ్యుని శిష్యులైనట్లును చరిత్రాత్మకంబు.

మఱియు నీకవి కం|| వీ|| గారి కవులచరిత్రము ప్రకారము 1687 నుండి 1757 సం|| వరకు నున్నట్లు సూచింపఁబడినది. ఈకాలములో రాజ్యపాలనకువచ్చినవారు పెదమాధవరావు, నరసింగరావు, వేంకట్రావు, జనార్దనరావు, వేంకటకృష్ణారావుగారు యుండిరట్లు నీకవియనంతరము చిన్నమాధవరావు పాలకులైయుండినట్లు పీఠికాపురసంస్థానచరిత్ర చెప్పుచున్నది. మఱి పెద్దాపురసంస్థానచరిత్రయందుఁగూడ వీరు క్రీ|| శ|| 1759 వఱకు పరిపాలించినట్లును మహమ్మదీయులనుండి 1755 వరకు పరిపాలించునట్లును 1750 వఱకును వీరికి కొన్ని శాసనములు పుట్టినట్లును చెప్పఁబడుచున్నది. కనుక నీలాద్రి మాధవరావులు ప్రభువులుగాఁ గవి చెప్పినప్పటికిని కవి పట్టప్రభువులని యుద్దేశము కాదు. కవియే సారంగధరచరిత్రము నందు నీలాద్రి మాధవరాయలఁ బేర్కొనక “రావు వేంకటకృష్ణరాయవిశ్వంభరారావల...” యని పేరుకొనియున్నాఁడు. కం|| వీ|| గారు యీసారంగధరచరిత్రను జూడలేదని వ్రాసికొని యున్నారు. పీఠాపురసంస్థానచరిత్రను చూడ నందున నట్లు వ్రాసియుందురు. అప్పుడు సాధారణముగా పెద్దకుమారుఁడు ప్రభువై రాజ్యమేలుచున్నప్పటికి నాయన సోదరులుకూడ రాజులుగానే గణింపఁబడుచుండిరి. ఇట్లే బొబ్బిలిసంస్థానంబున ప్రభువుగాని శ్రీరాజా జనార్దనరంగారాయణింగారు తమరు ప్రభువుగా మిత్రవిందాపరిణయమున వ్రాసికొనినారు. బొబ్బిలిసంస్థానచరిత్రమునం దీయన ప్రభువుగాఁ గానఁబడమిం జేసి సంశయనివారణార్థమై బొబ్బిలి మహారాజావారికి యుత్తరం బొందు వ్రాసియుంటి. అందుపై శ్రీమహారాజావారు “ప్రభువుల యన్నదమ్ములందఱు పూర్వకాలమున ప్రభువులుగానే గౌరవింపఁబడుచుండిరి.” అని (26-11-1920) జవాబు వ్రాయించిరి గాన కవి నీలాద్రి మాధవరావులు పట్టరాజులు కానప్పటికి నాచారములనుబట్టి ప్రభువులుగా లిఖించియుండు. ఈకవికాలములోనే 5 గురు ప్రభువులు పరిపాలకులైరి. ఈప్రభువులు 80 సంవత్సరములలోనే పరిపాలించి రాజ్యపాలనంబులొనర్చి కీర్తిశేషులైరి.

వీర లింత యచిరకాలంబులోనే మరణించుట ప్రజలు దురదృష్టవంతులు. అచ్చతెలుఁగున నిరోష్ఠ్యనియమమునకు దారితీసినవారిలో నీకవియే ప్రథముఁడు. లక్షణసారసంగ్రహమునఁ బూర్వలక్షణగ్రంథంబులో లేని నూతనవిషయంబును జేర్చి వ్రాసియున్నాఁడు. ఈసారంగధరచరిత్రమును శంకరునకు కృతియిచ్చెను. ఇందుఁ జిత్రాంగిని వేశ్యగా వ్యక్తీకరించియున్నాఁడు. ఈగ్రంథమందలి కథ శృంగారాదుల యనుప్రవేశము గలిగి కరుణారసప్రధానమై రమ్యతరమై హృద్యసూక్తిశోభితంబై యొప్పుచున్నది. ఈకవికవిత్వము మిగుల రసవంతంబనుటకు సుప్రసిద్ధుండగు ఏనుఁగు లక్ష్మణకవి

“హాటకగర్భవధూలీ । లాటనచలితాంఘ్రినూపు ♦ రారావ శ్రీ
పాటచ్చరములు తేనియ । తేటలు మా కూచిమంచి ♦ తిమ్మయ మాటల్.”

అని శ్లాఘించినట్లును, ప్రసిద్ధంబు. మఱియు జాహ్నవీమాహాత్మ్యంబునందు

గీ. వర్తమానకవీశ్వర ♦ వరునిఁ గూచి, మంచి తిమ్మకవీంద్రుని ♦ మదిఁ దలంతు''

అని గౌరవంబుగఁ జేర్కొనియుండె. ''బహుళగ్రంథములను రచియించిన వాఁడు ఇన్నిగ్రంథములను సలక్షణమైన మృదుమధురపాకమున రచియించినకవి యాధునికులలో మఱియెవ్వఁడును లేఁడు.'' అని రా॥ క॥ వీ॥ గారు వ్రాసియుండిరి. స్త్రీవర్ణనాదుల రసవంతముగా వర్ణించిన రసికజనమనోభిరామమును రచియించిన కొంతకాలమునకు కవి రాజమార్గమునఁ బోవుచుండఁగా నాగ్రంథమును చదివి యందలి రసికత్వంబున కానందించిన వేశ్య యీతనిమెచ్చి వలచి కౌఁగిలించికొనినట్లును, అంత నీతఁడు పెడమొగంబువైచి విదలించుకొని పోవుచుండ, అందుపైన నామె 'నీ కట్లు చెల్లునా' యని

చ. ''చతురులలోన నెంతయును ♦ జాణవటంచును నేను గౌఁగలిం
చితి నిటు మారుమోమిడఁగఁ ♦ జెల్లునె యో రసికాగ్రగణ్య''

అని యాశుకవిత్వమున నడుగగా, తిరుగ నాతఁడు

''యద్భుతమగునట్టి బంగరపు ♦ బొంగరపుం గవఁబోలు నీకుచ
ద్వితయము గ్రొమ్మునాటి యల ♦ వీపున దూసెనటంచుఁ జూచితిన్.''

అని పద్యముపూరించి జనెనని కథ యొకటి వ్యాపించియున్నది. ఏది యెట్లున్నను వీనినిబట్టి యీతనికవిత్వము రసవంతంబనియు తేలుచున్నది. గ్రంథవిస్తరభీతిచే నీతనిచరిత్ర యింతటితో క్లుప్తంబుగా ముగించితి.

ఈసారంగధరచరిత్రమును రాయవరము కూచిమంచి చిట్టెన్నగారినుండి యొకప్రతియు, కరప చాగంటి సుబ్బారాయుడుగారినుండి యొకప్రతియు, తణుకుతాలూకా కావలిగ్రామమునుండొకప్రతియు సంపాదించితిమి. చెదలుపట్టిపోయినపదంబుల పూరించక కుండలీకరణములలో నుంచి ముద్రించితిమి. కరపకరణంగారి మిద్దెపై పెండలపుదుంపలగంపలమధ్యలో వెదకగా చెదలుపట్టిన చివరాశ్వాసంబులతో గూడిన ప్రతి దొరికినది. ఏనుగు లక్ష్మణకవి నాశవృక్షంబును అచ్చటనే దొరికినది. ఈగ్రంథములను లోభులై మూలను ముక్కిపెట్టి పారవేసి పాపమున కొడిగట్టుకొను మూఢులవలెఁ గాక స్వార్థత్యాగబుద్ధితో మాకొసంగిన యీ పై మహనీయులకు మా కృతజ్ఞతావందనము లర్పించుచున్నారము.

ఇట్లు, సంపాదకుఁడు,

చిత్రాడ,
4—10—21.

చెలికాని లచ్చారావు.

శ్రీరస్తు.

# సారంగధరచరిత్రము.

## ప్రథమాశ్వాసము.

శ్రీకర గుణసార చిరశుభాకార, నాకధునీజూర నవసుకుమార
శరనిధితూణీర చంద్రికోటీర, పరిచితామర వారభంజితమార
ద్విరదదైత్యవిదార దీనమందార, గిరితనూజాదార, కృత్తినిశార
ధృతకురంగకిశోర త్రిపురసంహార, భుజగరాజాహార దండితక్రూర
మునిమనోబ్జవిహార ముదితకుబేర, ఘనభోగికేయూర కలితాస్థిహార
విజితశాత్రవవీర వేదమంజీర, రజతశైలాగార రమ్యప్రచార
జగదవనాధార సదమలాచార, నిగమాంతసంచార నిశితకుఠార
భువనైకశృంగార పుణ్యవిచార, వివిధసంగరశూర వృజినాపహార
మృదుతరవ్యాహార మృత్యువిదూర, విదితకృపాపూర విశ్వవికార
వినిభృతాఖిలభార విలసత్ప్రకార, వినయవిద్యాంకూర వీరావతార
హీరతారపటీర హిమఘనసార, శారదాంబుదహార చారుశరీర
చిరయశోలంకార సింధుగభీర, గురుతరోదార కుక్కుటలింగధర
యని యిష్టదేవతాప్రార్థనఁ జేసి, ఘనులఁ బురాతనకవుల భజించి
వనరుహాసనురాణి వాణినిఁ గొలిచి, తనర నేనిక మోము దైవంబు నెంచి
యలఘుతేజోనిధి యగుదెందులూరి, కులలింగనాథాఖ్యగురుని నుతించి
తలఁపున సారంగధరచరిత్రంబు, తెలుఁగున ద్విపదగాఁ దివిరియొనర్పఁ
బూని యే నిక్కావ్యమున కెవ్వఁ డధిపుఁ, డౌనకోయని మది నరయుచున్నంత.
శ్రీనగజాసమంచితకుచాలిప్త, మానితసారంగమదఘనసార
సాంకవాగరుగంధసారకాశ్మీర, పంకసంకలితశుంభద్భుజాంతరుఁడు
దినకరశతకోటి దేదీప్యమాన, ఘనఘనామణిమయూఖభ్రాజమాన
పవమానభుక్కుండలపరిష్కృతోద్భాస, వివిధవిభూషణావ్రాతలసన్మూర్తి
యశ్రాంతముకుటీకృతామృతాంశుపత్రి, భాశ్రేణికా ప్రతిపదసముల్లసిత
పటుజటాజూటాగ్రభాగభాగ్దివ్య, తటినీజలాంతరోత్పలకైరవుండు

కుంద చందన హార గోక్షీర హీర, మందార సురసరిన్మల్లీశుసార
కాకోదరాధీశ కాశ కైలాస, రాకేందునీకాశ రమ్యవిగ్రహుండు
డమరు త్రిశూల ఖడ్గ కపాల పరశు, కమల ఖట్వాంగ రంగత్కరాంబుజుండు
పాకజిన్మణివిభాభాసురాభీల, కాకోలరుగ్జాల కలితకంధరుండు
దుర్మద వేదండ దోషాచరేంద్ర, చర్మకౌశేయ కాంచత్కటీరుండు
ప్రసవబాణాసన ప్రవిమలగాత్ర, భసితాంగరాగ విభావిభాసితుండు
సదమలదరహాస చంద్రికోల్లసిత వదనామృతాంశుబింబ ప్రభాన్వితుండు
సముదగ్రకైలాస శైలోపమాన, రమణీయ భద్రోక్షరాజవాహనుండు
నందీశ గుహ గజాననముఖ ప్రమథ, బృంద బృందారకబృంద సేవితుండు
భక్తరక్షణకళా పారాయణుండు, భుక్తిముక్తిప్రదాద్భుతచరిత్రుండు
వరదుండు రజతపర్వతనికేతనుండు, కరుణాపయోధి శంకరుఁ డొకనాఁడు
గురుతరకౌండిన్యగోత్ర పావనుని, వరకూచిమంచి సద్వంశసంభవుని
గంగనమంత్రిశేఖరునకు నుత్త, మాంగన యగు నచ్చమాంబకు సుతుని
శివపదాంభోజాత సేవానిరూఢ, కవితామహారాజ్య ఘనధురంధరుని
సకలలక్షణలక్ష్యసాహిత్యవిదుని, నకలంక గానవిద్యావిశారదుని
రావు వేంకటకృష్ణరాయ విశ్వంభ, రావర పరిగుప్త రాజమహేంద్ర
వరదేశభాగ భాస్వద్దివ్య పీఠ, పురమహారాజ్య విభూషాయమాన
పావన కంద్రాడపట్టణాధిపుని, శైవకళారహస్యజ్ఞాననిధిని
ఘనులు మెచ్చఁగ ననేక ప్రబంధంబు, లొనరించి విఖ్యాతినొందిన ఘనుని
తిమ్మసత్కవినామధేయుని నన్ను, నెమ్మది గృపఁజూచి నీవొనరింపఁ
దలఁచిన సారంగధరచరిత్రంబు, వలనుగాఁ గృతిసేయవలయు మాకనుచుఁ
గలలోన బొడకట్టి కడలేని ప్రేమ, గులుక నానతియొసంగుటయు నయ్యఖిల
భువనైకనాయకుఁ బొదలెడు వేడ్క, నవిరళగతిఁ గృతికధిపతిఁ జేసి
నవ్యవైఖరి జేనొనర్చు నీభవ్య, కావ్యంబునకుఁ గథాక్రమ మెట్టిదనిన.
అవనిపై భోగమోక్షాకరం బగుచు, దివిజేంద్రనగరి నెంతే నగఁజాలి
కొత్తళంబులడంబు కోటలలంబు, కత్తలానులకొప్పు గజములయొప్పు
కేతనంబులసంచు గేములమించు, నాతిమిన్నలసౌరు నగరులతీరు
పసిఁడిమేడలచెల్వు పరిఖలనల్వు, కుసుమవాటులసొంపు కొలఁకులపెంపు
చప్పరంబులపిన్న జగిలెలయొప్ప, కప్పురంబులతావి గాణాలఠీవి
యాపణంబులవెన్క యనుఁగులకూర్మి, గోపురంబులయుంగు గోపులరంగు

పుడమివేల్పుల పెల్లు బాజగులతుప్రిల్లు, పడకటిళ్ల హొరంగు పనుల మెఱుంగు
గాచమొత్తము కెమ్ము రాణువయుక్కు, గోచయంబుల దిండు కోమట్ల మెండు
రంగవల్లుల గచ్చు రసికుల హెచ్చు, రంగస్థలుల పట్టు గచ్చుల మట్టు
మణికదంబము కల్మి, మాన్యుల బల్మి, గణికల పోడి లెంకల సెగ వాడి
వనముల సొంపు దేవళముల మంపు, పెనువజీరుల నేటు పెరిగడల నీటు
కాపు గేస్తుల బోజు గడితల తేజు, ధూపవాసన మేలు తోడవుల వీలు
గలిగి లోకాతీత సరిమఁ జెన్నొంది, తిలకింప గోత్రవిఖ్యాతిగో దేశమున.
సేతుకాశీముఖ క్షేత్రంబు లట్లు, భూతలఖ్యాతిచేఁ బొదలుచుఁ గోటి
లింగతీర్థస్నానలీలలఁ బొంపె, సంగి మార్కండేయ శంభుపదాబ్జ
పూజావిధప్రాప్తి పొసఁగ నెసంగు, రాజమహేంద్రవరం బనువీడు.
ఆవీడు పాలించు నయంబు వేల్పు, టావీడితనికంచు నర్థులు వొగడ
రూపనిర్జితపుష్పగోపుఁ డశేష, భూపసభాఖ్యాత పుణ్యకీర్తనుఁడు
రాజశేఖర పాదరాజీవయుగళ, పూజావిధాంబ భూరివైభవుఁడు
నిరతమహోద్దండ నిజభుజదండ, పరిచితకోదండ పరిముక్తచండ
కాండవినిర్జితోత్కటపరిపంథి, మండలేశ్వరచమూమండలోన్మదుఁడు
ధైర్యపరాభూత తపనీయశిఖరి, శౌర్యగంభీరతా చాతుర్యశాలి
మాననీయుఁడు సదా మధురభాషణుఁడు, దినకరదర్పితాతిమిర భాస్కరుఁడు
వివిధసంగరకళావిదుఁడు సమస్త, కవిజనచాతకోత్కరఘనాఘనము
నలహరిశ్చంద్రాది నానానరేంద్ర, తులిత మహాదాన దోర్బలాన్వితుఁడు
సకల వసుంధరాజన నవోద్యాన, నికరవసంతుఁడు నింద్రితేజుండు
దరశరశరదభ్రతారాసితాభ్ర, హరహారహరనీహారాభయశుఁడు
వరపాండవాన్వయవర్ధనుం డమల, తరమూర్తి విష్ణువర్ధనసమాహ్వయుఁడు
రాజరాజ నిలింపరాజవైభవుఁడు, రాజరాజనరేంద్రరాజన్యవరుఁడు
అతనిపట్టపురాణి యలికుల వేణి, పతిహితశుభవాణి పరమకల్యాణి
వితరణగుణ మహావిద్యామతల్లి, సతతయాచకబంధు జనకల్పవల్లి
పాలితాఖిలభూసుపర్వకుటుంబ, శైలజా చరణాంబుజద్వయాలంబ
సదమల కారుణ్యసహితాంతరంగ, విదితయశోజగద్వినుతప్రసంగ
పావనతాగంగ భాగ్యపౌలోమి, కేవల సౌభాగ్య గిరివరపుత్రి
వరరూపరతి సారవాక్యవాగ్రమణి, నిరుపమసామ్రాజ్యనీరధి తనయ
వితతక్షమాగుణ విపులావధూటి, యతిసాధ్వి రత్నాంగి యలరొందుచుండు

నాకితనయుఁ డనినాకితనయుఁడు, సారసహిత విభాసాహస హితుఁడు
ప్రత్యర్థి దానశుంభద్రవిణుండు, ప్రత్యర్థిదానశుంభద్రవీణుఁడు
గానలోలుఁడు దయాకలితమానసుఁడు, మానవతీనవ మకరకేతనుఁడు
కదనభీకరుఁడు శృంగారవారాసి, విదితచతుష్షష్టి విద్యావిదుండు
ధారుణీతలధురంధరతాభిగుప్త, సారంగధరుఁడు రాజత్కాంతివిజిత
సారంగధరుఁడు పూజావిధోల్లసిత, సారంగధరుఁ డైన సారంగధరుఁడు.
ఆరాచపట్టిసోయగము దైవార మేరమీఱిన వేడ్క మొయి నొకనాఁడు
జనకుండు వేటకుఁ జనియున్న వేళఁ, దనతోడి రాజనందనులును దాను
పావురంబులఁబట్టి పందెంబు లైని, తారాపథమునకు దమి నెగవిడువ
రాజసూనుని పావురము వానినెల్ల, రాజసంబున మీఱి రయముగు దీపింప
జెక్కలల్లార్చి తూఁకికడంక మెఱయ, దక్కిక రెక్కలదాఁకికి నెగసి
పేరెముల్ వాఱుచుఁ బెక్కుచందములఁ, గేరుచు సుడిగొని కేళ్లుదాటుచును
చూడఁజూడఁగఁ దద్దసూక్ష్మరూపమున, నోడక గాడ్పున కుద్దయై పఱచి
అమరాపగాసైకతాగ్రభాగములఁ, గొమరారు రాయంచకొదమ యనంగ
గగనకేశుని శిరోగ్రం బెక్కజాఁగు, తొగలసంగడికాని తునియ యనంగ
ననిమిషద్విరదంబు హస్తంబులోనఁ, బొనరారు నెలిదమ్మిపూమొగ్గ యనఁగఁ
దనకులస్వామియై దనరెడువరుణుఁ, గొనబారుతమిఁ గనుంగొన బారుకరణి
మిసుకుమిక్కుమటంచు మిగుల దవ్వేగి, కనఁబడరాకున్న గలఁగి యుండఱును
తలలెత్తిజూచుచుఁ దత్తరింపుచును, గిలకిలనవ్వుచుఁ గేకలిడుచును
చప్పట్లు జఱచుచు సద్దుసేయుచును, కెప్పలువ్రేయక రేసిచూచుచును
కలరవంబదె పోయెఁగదయంచు వేడు, కలరవంబొసంగు సంగడికాండ్రఁజూచి
చిరునవ్వు మోమునఁ జిగురొత్త దాని, మఱలింతునని రాకొమరుఁడు నైళంబ
పెంపెసపిట్టదెచ్చి పెడగరుల్ పట్టి, వింటికెత్తుచుఁ గేకవేసి పిల్చుటయు
బిరబిర సజ్జగబిరుసుపావురము, మఱలివచ్చుచునుండె మఱియంతలోన
ధాత్రీశ్వరుని భోగతరుణియై దనరు, చిత్రాంగి మేలిపసిండి సోయగపు
మేడపైఁ గ్రీడల మెలఁగుచునుండి, యీడుమీఱిన యాఖగేంద్రోత్తమంబుఁ
గనుఁగొని ముద్దుజిక్కనుగొని చేత, నునిచి దానికిఁజూపి యొయ్యనఁ బిలచె
పిలిచిన నదితన పెంటిగాఁదలఁచి, చెలగి సార్వ్యమువచ్చి చిలుకపై వ్రాలె
వ్రాలిన మెల్లన వాల్గంటి దానిఁ, గేలఁగీలించి కోర్కెలు వెల్లివిరియ
మేడ దిగ్గనడిగ్గి మితిముకరాని, వేడుక నుడిగొపువెంటఁబుఁ దాను

కడువింతహొయల జొక్కటమై నెలుంగు, పడకటింటికి దొట్రుపడక రమేతెంచి
పావ్యంబు నొకచోట పదిలంబు చేసి, పవ్వడుకొంకల్ పండిపో మిగులఁ
జక్కనివాఁడైన సారంగధరుఁడు, చిక్కెఁబో నేఁడు నాచేతనటంచు
విక్కుచుఁ జొక్కుచు విఱ్ఱవీగుచును మిక్కిలి తమకంబు మేకొనఁ గ్రొత్త
సింగారమూని కెంజివురువిల్కాని, బంగరుబొమ్మనా భాసిలుచుండె.
అంతరాకొమరుఁ డట్లాపుల్లు జనుట, కెంతయు నగచి చేయంది నెమ్మొగము
వెలవెలఁబార నివ్వెఱపడి దిశలు. గలయనీక్షింపుచుఁ గళగవ మొందవ
మొరసి నాబంగరుముద్దుపావురము, నెనలేనికడఁక నేఁడేల చేవదలి
యనిచితి ననిచిన నదియేల దప్పె. చనెఁ జనుఁగాకేమి సయ్యన ముఱలి
చేతికిరాక యాచిత్రాంగిమేడ, కాతతగతి నేటి కట తేలిపోయె.
పోయిన మఱల గొబ్బున దానిదెచ్చి, యీ మొదమాన్పవా రెవ్వరు గలరు
ప్రేముఁబెంచిన నేఁటిపిట్ట బోవుటకు, నేమిసేయుదు కర్జమెయ్యది యింక
చెల్లంబో కటకటా శివుఁ డిపుడిట్టి, కల్లకంబేల డెందమునకుఁ గూర్చె
నయమెన్న రాచలోనగరున కొదువ, భయమూన కేకిలి బనుపఁబోసంగు
కావున నేనె యక్కలికిఁ బ్రార్థించి, వేవేగఁ గొనితెత్తు విహగోత్తమంబు
నని చనచుఁ కించు సదను సుమంతుఁ, డను మంత్రినందనుం డైనసుబుద్ధి
యారాచపట్టికి నడ్డంబుమాఁకి, కూరిమి మెరయఁ గన్గొని యిట్టు లనియె.
కటకట నృపపుత్రి కర్జంబె యింక, కిటువలెఁ బోవనూహించుట దగనె
మిగులమన్ననఁ జేసి మీరు పెంచుటకు, తగిలి మేల్పనిఁ గూర్ప ధర్మంబు మాకు
రాజుర లేనిచో రాచనగళ్ల, నోజమాలి చరింప నుచితంబె నకు
దొరసాను లెవకుఁ బోదురె యువజనులు, నరనాథపట్టి మున్నెరికలు మాను
చక్కఁదనంబున జాణతనంబు, నెక్కువశీవియు నెలజవ్వనంబు
గలిగిన జగవన్నె కాడవు నీవు, దలఁప నమ్ముద్దు కెందలిరుఁబోఁడియును
చక్కఁదనంబును జాణతనంబు, నెక్కువ శీవియు నెలజవ్వనంబుఁ
గలిగిన దొంటిమై గనుఁగొన్నవేళ, తలఁపు లెట్లుండునో తర్కింపఁబోల
దేకాంతవేళల నేకాంతనైన, భూకాంత చక్కనిపురుషుఁ డబ్బినను
పదరాని వెతలచే పైఁబడుఁగాక, విడువనేర్చునె పట్టి వేఁడిఁడి యగుచు
విరిబోండ్ల డెందముల్ వివరించి తెలియ, హరిహరాదులకు శక్యముగాదనుచుమ్ము
ధనముజూచిన వధూననము గన్గొన్న, మనసువాదదె యెట్టివారల కైన
నలపరాశరకౌశికాదులు చెలఁగ, వలఁజిక్కరె నెంతవారలు నరులు

వలపు వచ్చిన వారివారలు నున్న, దలఁపు నమ్మికకై యిల్లు తాల్మి హుళక్కి
కోపమెక్కువ దయాగుణము కొంచెము, చాపల్యమధికంబు సత్యంబుతీలు
పలుమరు తలఁపుట్టి బాసఁజేసినను, తలిరుఁబోఁడుల నమ్మఁదగదు కుమార
జారుల వేశ్యవారి చురుకుఁజూపులకు, బోటికూటువలయబ్బురపుఁదూపులకు
సుదతుల జిలిబిలి సోలపుఁబాటలకు, ముదితల ముసిపెంపు ముద్దుమాటలకు
ననబోండ్ల చిన్నారినగవు వెన్నెలకు, వనితల క్రొత్తజవ్వనపు వన్నెలకు
నింతుల గుబ్బ సొబ్బెంగ్ల సోయగములకు; దంతిగామినుల నిద్దపుటూరులకు
మెలఁతల గడితంపు మెఱుఁగుఁగొప్పులకు, నెలఁతుల నాడెంపు వింతయొప్పులకు
రమణీమణుల నిగారింపుచెక్కులకు, కమలలోచనల యక్కజపుటెక్కులకు
పడఁతుల మోముదామరల తేటలకు, పడఁతిమిన్నల వేడబంపుటాటలకు
వలవనుండుముగా దేవతలైన నహహా, కలికి పైఁబడి తద్ద గారగించు నిన్ను
గాంచిన్న నెమ్మెయిన కల్లలుగూర్చి, కానజేయును రాజుగారితోఁ జెప్పి
యొఱఁగి మెఱుంగకే మైపెంచు లేని, కరటికసం బేల కాంచెదవయ్య
నీవు నెమ్మనితో నిలిచితివేని, పావురాయలు లక్షపదివేలు గలవు
తలయున్న మణిమయోన్నతకిరీటములు, గల వెన్నియైన నిక్కంబ బట్టులగుటఁ
బోవవల్వదటంచు బోదవినఁ గినిసి, భూవరసుతుఁ డాసుబుద్ధి కిట్లనియె.
అహనవు మేలుమే లహహా నీబుద్ధి, వివరించిచూచిన వింతలై తోఁచె
నగమనలేక నెయ్యముని మాతోఁ, బెరుఁగుచుండుటఁజేసి భీతిపోవిడిచి
వీనుల కీటులై వినరింపుగాని, కానిమాటలు పల్కఁగాఁ జాగితిపుడు
నీతిమార్గములెల్ల నేర్పుటటంచుఁ, బాతకంబులు పల్కఁబాడియే నీకు
కొంకకెందును దల్లికొడుకుల సంధు, అంకులుగట్టు బల్ రాగలు గలరె
యనయమూతల్లి రత్నాంగి యొక్కతెయు, సుపుణ్యచిత్రాంగి యొకతెయు తెలియ
పాఱఁడవగుట నాపక నెరపేరి, తూరిచూడెద విట్లు దోసంబు గాదె
పరమపతివ్రతాభరణ మత్తరుణి, పరుని నెవ్విధమునఁ బైకొనఁగోరు
కోరఁబో ననుఁ దనకొడుకని చూడ, వేరీతిఁ గవయుట కిచ్చలోఁ దలఁచు
తలఁచినఁ బరవనితాసహోదరత, నెనయునే నప్పని కెట్లు లియ్యకొందు
కొనకున్న సతి పట్టికొండెంబు లేల, జనవల్లభునకు కొంచక చెప్పఁజూచు
చూచిన నమ్మహీశుఁడు కల్ల నిజము, లేచందమున నిర్ణయింపక నుండు
నుండిన మది దనయుండని యనక, దుండగంబూని యేత్రోవ దండించు
దండించుగాకేమి దైవయోగం బె, టుండిన దోలఁగఁజేయుట కేరితరము

తరముగాదింకని దబ్బఱల్ మాను, మరుదండ నిటకెత్తు నవ్యాహంగంబు
ప్రాణపదంబైన పసిఁడి సార్వంబు, నేనేమిటికిఁ దేక నిపుడూరకుందు
నని మానకేడ్చు సకుమారకునిఁ, గని మంత్రిసూనుండు క్రమ్మఱఁ బలికె
వినుము కుమార నావిన్నపం బిపుడు, నెనరువో నాడక నీకు హితంబె
చెప్పెదఁగాని వంచించుట గాదు, తప్పదు నామాట తథ్యంబు సుమ్మి
నలువ లోకములోని నలుసెల్లఁ గూర్చి, చెలువార నమ్ముద్దుచెలువ నొనర్చె
దానిజగారంగు దానిహొరంగు, దానికన్నులతీరు దానికొన్ సొంపు
దానికొప్పుమ్రుడిపిప్ప దానిమెయిమెఱుపు, దానిగుబ్బలహెచ్చు దానివేల్గచ్చు
దానిచెక్కులటెక్కు దానిబల్టెక్కు, దానిమోముమెఱుంగు దానితెఱంగు
నర సుర గరుడ కిన్నర యక్ష భుజగ, హరిమధ్యలకునైన నబ్బదుసుమ్మి
కడలేనియొరపు నిల్కడఁగన్న మెఱపు, పడఁతులమిన్న యబ్బఁరపుపూఁబొన్న
పసిఁడిసలాక కప్రపుటంటిమొక, కుసుమబాణుకటారి కులుకుమిటారి
మొలకవెన్నెలతేట ముద్దులమూట కులుకువజ్రపుబొమ్మ కలువపూరెమ్మ
వలపులదీవి గోవజవాదికోవి, బలుముత్తియపుగోవ పగడఁపుదీవ
చిత్తజువిరిముల్కి చిలుకలకొల్కి, క్రొత్తకస్తురిలప్ప గోనఁబులకుప్ప
వలుదగొజ్జఁగిబంతి వన్నెలదొంతి, తళుకుటద్దపుడాలు తలఁగనిమేలు
నెఱతనంబులప్రోవు నీటులతావు, కొరలు తేనియబావి గుజ్జుతేమావి
యాయన్నుమిన్నసోయగముఁ గన్గొన్న, మాయురె సురలైన మరులుగొండ్రన్న
కలికి వేనలి కెనగాక మొగిళ్లు, వెలవెలబాఱుచు విడిమలల్ వట్టె
ముద్దియనిద్దంపు ముద్దునెమ్మొగము, నద్దివోలక మచ్చయూనె జాబిల్లి
ననబోడి బొమలయందముఁ గనలేక, తునియలై మరువిల్లు ధూళినడంగె
కలికి బేడిస లింతికన్నులు జూచి, కలగి రెప్పలుమోడ్వఁ గానకయుండె
నాళీకదళనేత్రి నాసకునోడి, వీలి సంపఁగిమొగ్గ విన్వాడంగె
తోవకంటి చెక్కులతోఁ దీటుగామి, రవళిసద్దముల రారాపులఁ బడియె
పడఁతి వీనులచెల్వు పడయంగ రామి, నడుగ కెంతయు వ్రేగుచుండె శష్కులులు
తెలివమెఱుంగువాతెఱ జోకగాక, తరిదప్పి చివురులెంతయు గారుపాఱె
ముగుద క్రొంజిగిదంతములకుఁ గిందగుట, మగటాలు త్రాసంబు మానక పూనె
నుదురాజముఖియుత్రి కుద్దిగాలేక, నుడివడి మొరసేయఁజొచ్చె చిందంబు
లతివబాహువులకు నళిచేతులకును, బ్రతిగాక మడుపులంబడె బిసాంబుజము
లెలనాగి గుబ్బపాలిండ్లను నోడి, పలువన్నియలఁ గ్రాగె బంగరుగిండ్లు

మదవతిమూఁగారు మాఁదిఁగాక, పొదలుతుమ్మెదచాలు పొదలలో నిరికె
జలజాక్షివళులతో సవతువోలమిని, పలుమరు తెరఁగలు భంగంబునొందె
చానపొక్కిలితోడ సాదృశ్యమూఁగ, గానక మడుపులు గలఁగుచునుండె
లలనవెన్నడుముఁ బోలఁగలేక సింగ, ములు గుహల్ మూఁది యొప్పందు బొబ్బరించు
పొలఁతిపిరుఁదుల పురుడుగాలేక, యిల మెత్తబాటూనె యినుకతిన్నియలు
కరయాన తొడలపొంకముఁ గాంచనోడి, కరటితుండములు వక్రితయూని మెలఁగు
కలమగభ్యములు వ్యాలుంటిపిక్కలకు, తులగాక త్రాణమూనెఁ దుది వెన్నుఁజూపె
పూఁబోఁడి మీఁగాళ్లఁ బోలక నీట, తాబేళ్లు డాగెనో దలఁజూపనోడి
యలివేణీయడుగుల కనిశంబు నోడి, నళజలజాతబృందము బైల్లబడెయె.
తోయజాననచెల్వు దూకొనిపొగడ, వేయినోళ్ల భుజంగవిభునకుఁ జనదు
చిత్రింగ యనుమాట సిద్ధంబుగాఁగ, ధాత్రి నమ్ముద్దుపైవలి వెలుంగొందు
తరుణాలఁ గన్గొన్నతెరని రాయైన, కరఁగునటందురు లోకములోని జనులు
నరనాథ వెన్నకన్నను మెత్తనైన, పురుషుల డెందమప్పుడె జాలుఁగొనద
కావున నయ్యింతిఁ గనుఁగొన్నయపుడె, భావజుఁ డరిమురి బాధింపఁజాగు
వేయినేటికి పట్టిపెట్టులు మాని, రాయడ యింటికిరమ్ము రమ్మనిన
మనుజేంద్రతనయుఁ డమ్మాటయించుకయు, వినఁబోక తనపాలివిధిగట్టి త్రోచు
కొనిపోవ నరిగె తెళ్కుపిసాళివాలు, కొనఁజూపు లెననిదిక్కుల దెక్కుచూప
తీరుగా కొనగోరదిద్దిన నొసలి, తోరంపు నిడుదకస్తురిరేక యొప్ప
బంగరుతగటుపప్పటి వలెవాటు. రంగుల నల్లవ రాణబొసంగ
నిరవొప్పఁ బసిఁడితాయెతులు గొజ్జంగి, విరిసరంబులు జుట్టిపేర్చిన యోర
సిగమీఁద జరతారు చెంగులమేలి, జగరంగుగల బురుసారుమాల్ మెఱయ
తెలిహురుమంజి ముత్తియపుచౌకట్లల, తళతళల్ చెక్కుటద్దములను బొదల
కలికిరాచిలుక ఱెక్కల లెక్కఁగొనక, యలరు బచ్చలతాళి యరుతవెలుంగ
నవరత్నమయ కంకణము లుంగరములు, వివిధభూషణములు వేనవేల్ వరల
దండిగా వజ్రాలుదాపిన మేటి, గండపెండేరము డాకాలఁ జెలంగ
పట్టుగా కటిమీఁదఁ బైచెంగులుంచి, కట్టిన జరబాబుకానె భాసిల్ల
గోవజవాదియు గొజ్జంగనీరు, పూవుటత్తురుబింకపొక్కిలి మంచి
గందంబు కపురంబుగలపిన కలప, మందంబు మేనఁబూయక తావులీన
చెలువార మెలిచక్కఁజెరివినమంచి, బలువమ్మి కెంపులబావు శోభిల్ల
పుడమికిడిగ్గి యబ్బురపుఁవేసమును, బడసి గ్రీడించు బయంతుఁడో గాక

కంతుఁడో యామినీకాంతుఁడో నవవ, సంతుఁడో యని జనుల్ సారెకు నెన్న
చిత్రాంగి మొగసాలఁ జేరి యచ్చోటి, వేత్రహస్తులమీఁటి నెసతోనుమారి
పగడంపుగుండ్రకంబములు నీలంపు, జగిలెలు ముత్యాలజాలీలు చంద
మామరాగోడలు మగరాలమెట్లు, తామరకెంపు బల్ తలుపులు పులుగు
రామానికంపుతోరణము నెడంద, గోమేధికంబుల కొమరలు జార్లు
పిల్లికన్నన్ని శాబెడిదంపుటోడు, బిళ్లలు పటికెంపుబొండెలు పుష్య
రాగంపు వెనుచదరములు వాసములు, బాగైన యపరంజి పసిఁడిమూలములు
గలిగి శృంగారనైఖరులఁ జెన్నారు, కొలువుకూటంబులు గుత్తంపుమిద్ది
యలు మల్లెసాలలు నాటకీయములును, చలువపెంజవికెలు చంద్రశాలికలు
మొదలగు నిమ్మ లిమ్ముగఁ గనుంగొనుచు, గొదుగక బంకుబంకులుదాటి చనుచు
గొజ్జంగిపూ నీటికొలఁకుల పజ్జ, గుజ్జులేమావిమ్రాకులఁ బెనఁగొన్న
పరువంపు వలిదాకఫందిరిచాల్పు, సరసఁగ్రాల్ నునుగున్నసంపెగల్ దరసి
పోద్రిది కప్రపుటంటిబోదెల చెంతఁ, బావొప్పు చంగల్వబావులు గడచి
వలపులుగులుకు చెల్వపువట్టివేళ్ల, చలువచప్పరములచాయల నిల్చి
తావుల్ గుబాళించు దట్టంపుమల్లె, పూపుఁబందిరుల ప్రాపున విశ్రమించి
కలువరారాదోనిగముల జాల్వారు, చలువకొవ్విరిదేనెజక్కురల్ దాటి
పొన్నలు పొగడలు పోకబోదియలు, సన్నజాజులు పనసలు దాసనములు
నిమ్మలు దబ్బలు నేరేళ్లనంట్లు, కమ్మరేగులు నారికడము లిప్పలును
మాదిఫలంబులు మారేడు లీడ, లాదియగా కేళీవిహార భూరుహము
లందందదాటి చిత్రాంగి లోనగరి, కందంబుగా నేగి యట నిల్చుటయును.
అప్పుడు చిత్రాంగి యబ్బురంబొదువ, గుప్పునలేచి యెకుర్కొవ తత్తరమున
చిత్తరించుపిసాళిబెళుకువాల్జూపు, మొత్తముల్ తొగలనిమ్ముగఁగుమ్మరింప
వెన్నంటు గిల్గంటు వ్రేగునదట్ట, సన్నంపులేఁగౌను జవజవలాడ
కట్టాణిముత్యాలకమ్మల డాలు, ధట్టించి చెక్కుటద్దములఁ జిందాడ
మేపూతకలపంపు వలినెత్తావు, తేపొంది దిశలనెల్లెడ గుబాళింప
గాటంపువలియూర్పు కమ్మదెమ్మెరలు, మేటితుమ్మెదల నామెతలకుఁ బిలువ
జిలుకుపైఠాణికంచెల పిక్కటిల్లి, కులుకుసిబ్బెపు గబ్బిగుబ్బలుపొంగ
బలితంపుచెంగావి పావడకుచులు, వలిపెక్రొందగటచ్చు వల్వపైబొదల
మంజులాలంకార మణిగణకిరణ, పుంజములొడల విప్పుగగప్పుకొనఁగ
ఘంటల మొలనూలి ఘణఘణధ్వనుల, నంటి జంటగగిల్కుటందియల్ మొరయ

మురువైన హురుమంజి ముత్యంపుసరులు, పరిపరిగతుల గుబ్బలపై నటింప
కొరమించు తొలుకరిక్రొమ్మెఱుం గనఁగ, చెఱకువిల్తుని వాడిచేకత్తి యనఁగ
తొగలసంగడికాని తునియ యనంగ, పొగడొందు జంత్రపుబొమ్మ యనంగ
లలితంపునవపుష్పలతికయో యనఁగ, జిలిబిలివలపులఁ జిక్కి యక్కొమరుఁ
దప్పకఁ గన్గొని తడబాటెసంగ, గుప్పగుప్పనమూరె గుప్పెళ్లకొలఁది
గుప్పెడు మరునివాల్ క్రొలసోకులకు, ముప్పిరిగొను మోహమున బిట్టుసొలి.
జౌర వీనియొయ్యార మరయ వేమారు, మారుఁ గుబేరకుమారు వేమారు
సారలతాంగుళీసా రలరారఁ, గోరి చూచిన పూలకోరీవజీరు
దాడి నెంతేనియుఁ దల్లడపడుచు, వీడరేగుట్టెల్ల విరహాబ్ధిమునిఁగి
యమ్మమ్మ పీనిసోయగ మెల్లనోలిఁ, దమ్మిచూలికినైన దరమె వర్ణింప
గట్టిజమిలిముక్కాలిచాల్ దెగడు, నిద్దంపు నిడుదపెన్నెఱకులవాఁడు
నిండుపున్నమకల్వ నెచ్చెలికాని, దండినేలెడు మోముఁదామరవాఁడు
మరునిసింగిణిల వేమఱు నుద్దిమీఱి, పొరినెగ్గులెన్ను కన్బొమ్మలవాఁడు
కలువరేకులసొరుఁ గాదని కేరు, కలికిబిత్తరిసొగకన్నుల వాఁడు
మొగిఁ గ్రొత్తసంపంగిమొగ్గచాలుపుల, నగెడు చొకారంపు నాసికవాఁడు
మలయుచు గుజ్జులేమావిచిగుళ్లఁ. గిలకిలనవ్వు నుగ్గైమోవివాఁడు
మొల్లమొగ్గలసొంపుమొగి దటారంపుఁ, బిల్లఁగంబున గెల్చు పలుచాలువాఁడు
కలికి రేయెండనిగ్గులు వెదజల్లు, నలువైన చిన్నారినవ్వులవాఁడు
తళుకుటద్దపుడాలు దలకింపఁజాలు, చెలువంపు క్రొంజిగిచెక్కులవాఁడు
కడఁగి తొమ్మిదవలెక్కల లెక్కఁగొనక, వెడఁదలైగన్పట్టు వీనులవాఁడు
డంబారుబవరిగడ్డమువాఁడు సోయ. గంబూనుదరనిభకంఠంబువాఁడు
హరితనూభవ హస్తిహస్తోపమాన, పరికలితాజానుబాహులవాఁడు
వాటంపు వజ్రకవాటంపు గుంపు, నీటెల్లనుడిగించు నెరఱొమ్మువాఁడు
క్రొందుగక సింగంపుఁగొదమకూటువల, నదలింపదొరకొను నలఁతికౌన్వాఁడు
హెచ్చుగా గాటంపుటిసుకదిన్నియల, పిచ్చలింపఁగనాడు పిరుదులవాఁడు
హరువైన నాడెంపు టనఁటికంబముల, గురుతరోన్నతి నెన్ను కురువులవాఁడు
తొడరి మారుని యంపదొనలసొంపెల్ల, సడలింపఁ దమకించు జంఘలవాఁడు
దట్టంపుజిగి మెట్టతామరవిరుల, నట్టిట్టుగాఁ బలుకు నడుగులవాఁడు
జిగిమించు మేలిపసిండిసలాక, నిగనిగల్ దరిగించు నెమ్మేనివాఁడు
హా యిజ్జగన్మోహనాకారుతోడఁ, బాయక నర్తించుభాగ్యంబు నాకు

నెనయనల్పాదె పురాకృతపుణ్యమహిమ, ననుచు దిగ్గన వాని నరలేక కదిసి
వినయంబు నొరవును వేడ్కయు వలపు, నెనరును మురిపెంబు నెఱపుచునున్న
మెలఁతుక కారానమిన్న మ్రొక్కుటయుఁ, గిలకిలనగి వాని కేలుపట్టుకొని.
పగడంపుసకినెల పట్టెమంచంబు, తగటుబాలిసు మేలుతాపితాపఱపు
దిట్టపుపని దోమతెర జరతారు, పట్టియ జిలుగుహొంబట్టుతలాడ
చందుగపెట్టియల్ జరబాబుజీబు, చందువా ముత్తెంపుసరుల జాలీలు
పన్నీటిగిండ్లు సంపఁగినూనెకొ్రవి, చిన్నారియడపంబు చిలుకపంజరము
గందంపుసాన చిక్కపుగట్టె పెట్టె, మందసంబు విచిత్రమణిగవాక్షములు
కపురంపుబరిణె చిల్కలదివ్వెగంబ, మపరంజిపీణె పూటత్తరుకుప్పె
తూగుటుయ్యెల లక్కదూవెన తబుకు, బాగాలసంచి కప్రిపుపేర్ల పుటికె.
నీలంపుకిటికిటెల్ నిలువుటద్దములు, జాలవల్లికెలు పచ్చలగట్టెపీట
పసిఁడిపావలు తమ్మపడిగంబుపూల, విసనకఱ్ఱలు గొప్పవింజామరములు
వలపారు గోవజవాజిపంకిణులు, కలపంపుగోర నున్నస్తుకిపెట్టె
కాటుకమచ్చెంబు గరుకరాటంబు, నేకైన చిటిచాప నెత్తంపుఁబలక
చిత్తరుగోడలు చికిలిముగ్గులును, పుత్తడితలుపులు పులుగురామెట్లుఁ
గలిగి కన్నులపండువులుగ నెలుంగు, బలుమానికెంపుటొప్పరిలోని కతని
కొంకక సరగగోడ్కొని చని పట్టె, కంకటిదరిఁ బైడిగద్దియ నునిచి
పసిఁడిగొప్పెరలతోఁ బన్నీరుదెచ్చి, పొసఁగ నాతనిపదాంబుజములు గడిగి
మలయజాగరుమృగీమదఘనసార, మిళితాంగరాగంబు మెయినిండనలఁది
వలపులుగుల్క చెల్వపుబొడ్డుమల్లె, యలరుటెత్తులు దద్ద యక్కసనుంచి
యపరంజిరేకుల ట్లొసరునాకులును, కపురంపుబాగాలు కాచుటుండలును
ముత్తెంపువలినున్నమునుఁగూర్చి మిగులఁ, బత్తిఁ దాంబూల మర్పనముగావించి
ఘనతర నవరత్నఖచితభూషణము, లనుపమ చీనిచీనాంబరంబులును
కనకపాత్రికల ముంగల కానుకలుగ, నినిచి కురంగటనిలిచి నెత్తావి
క్రొన్నన నురటిచేకొని వలినాలి, సన్నగాడ్పులు వెడఁజల్ల వీచుచును
చిలుకపతాశి తేజీవజీరుండు, బలుగబ్బిగుబ్బగుబ్బలులపై నినుచు
కఱకుకొ్రవ్వాడిచెంగలువపూములుకు, లరిమురి చురఁజుర నదరంటిపార
నీలంపుగాజుల నెరిమించు పసిఁడి, కీలుకడెంపుడాకేలుచన్గుబ్బ
కెలనికిచేర్పుచు కేరిఁగంటివాడి, సొలపుఁజూపులు కూర్మిజొప్పడఁజేయ
చిన్నారి తెలినవ్వు చెక్కుటద్దముల, వెన్నెలనిగ్గులవిథ మొదవింప

కమ్మచక్కెరపానకమ్ము లిమ్మనరఁ, గ్రమ్ము నుగ్గైనొమ్మ్రవి గదలించింపఁ
బలుకులఁ గప్పురంపుపలుకులు వొలియఁ, గులికి యచ్చిలుకలకొలికి యిట్లనియె.
రాజకుమార చంద్రమనీహారంగు, భూజనంబులు దద్ద బొగడ నేశాద్రిద్దు
వీనులవిందుగా వినుచుండి యెన్నఁ, డేనినుఁ జూతునం చెంతయు మదిని
నివ్వటిల్లెడుకూర్మి నిచ్చలుఁ బెరయ. నువ్వెళులూరుచు నుడుగకయేచు
కఱకువెంజెఱకువిల్కాని ధాకలకు, మొఱకపల్గాకిపెంపుడుల కూకలకు
నెరయుఁ బాటంపుపన్నీటిబాకలకు, మెరయుటాటోటు చుమ్మెదలపోకలకు
తులువ చెంగలువబందుగుని కాకలకు, కలికిరాచిలుకటక్కరుల మూకలకు
కొలఁకుల నెత్తావిసోకుడుల వీకలకు, మలయుకెందలిమలెమావిమోకలకుఁ
డస్టయు నల్లంబు దల్లడిల్లంగఁ, బ్రొద్దోకయేడుగాఁ బొదలింపుచుండి
పున్నమరేతేనిఁబోలు నిన్నిప్పుడు, కన్నులపండువుగాఁ గనుంగొంటి
కొనసాగెపుణ్యంబు కోర్కెలీడేరె, మునునోమినట్టి నోములు ఫలియించె
గామిడియై పెక్కుకడగండ్లఁ బెనచు, కాముని కొకబొమ్మఁగట్టితి నింక
నెప్పుడు నీరాక కెదురుచూచుచును, ముప్పిరిగొను మోహమునఁ గ్రాగుచుండు
పతిఁబాసి వలవంతబడలు నిన్వేళ, గతియైతి వుసురులుగాచి రక్షింప
మేలు నీవొనఁగూర్చు మేలు మరల్పఁ, జాల నిన్నెపుడు నాసామిగాఁదలఁతు
జాగేల నాకోర్కె సఫలంబుజేసి, భోగింపు మిచ్చట పూసెజ్జఁ జేర్చి
పెట్టినకానుకల్ ప్రేమఁగైకొనుము, పట్టుగ నన్నుఁ జేపట్టుమటన్న
అవనినాయకసూనుఁ డప్పుడు వీను, గవకు వేడిసలాక గాడినట్లగుచు
బెడిదంబుగా పెద్దపిడుగునుబోలు, చెడుమాటయాలించి చిత్తంబుదలక
శివ మహేశ శశాంకశేఖర యనుచుఁ, జెవులుమూసికొని వచించె నిట్లనుచు.
చెల్లంబో కటకటా చెప్పనబ్రముగ, తల్లిరో యిట్లాడధర్మంబె నీకు
పరికింప నెరరాచపడఁతు లెందైన, ధర నన్యపురుషులఁ గలఁపఁగోరుదురె
చెవులకు వినరాని చేడ్పాటుమాట, శివశివా నాకు ద్రవ్వ జెల్లునటమ్మ
కన్నియ యిటువంటికరతలు విన్న, విన్నసైజనులెల్ల విస్మయపడరె
నీతివోవిడిచెదు నీవొక్కవిధము, మాతల్లి రత్నాంగి మతిమొక్కవిధమె
మదిరాక్షి నే నీకుమారుండ నాకు, గొదుగక యీపెద్దకొలఁ గట్టఁదగునె
కలికిరో నీవంటిగరితలిల్లైన, నిలవల్వ్వదనువార లెవ్వరు గలరు
వనిత నన్నొకలాతివానిఁగాఁ దలఁచు, కొని యుపచారముల్ గూర్పనాయంచె
క్షితిఁ దల్లిదండ్రు లార్జించిన సొమ్ము, లతివ పుత్రులవిగా కరయ నెవ్వరివి

నీవిచ్చుసొమ్ము లిందే దాచుకొందు, కావలసినవేళ గైకొందుజుమ్మ
సితకరవదన నాచేతిపాత్రంబు, గతిదప్పివచ్చి నీకడ నుండుటయును
దానికై నగరివో ధరణీశ్వరుండు, లేనిచో నైన నా లెంకుజంకులేక
పినతల్లివని యాత్మఁ బెద్దయునమ్మి, యనవునఁజేరి నీచరణపద్మములు
గనుఁగొని మ్రొక్కఁగఁ గంటి వాల్గంటి, కనికరంబెలయ నాకలగవోత్తమము
నిడి సత్వరంబున నింటికిబనుపు, మిడుమలఁబెట్టక యిడుమాజ్ఞ యనిన.
కలకలనవ్వి యక్కలకంఠకంఠి, పలికె నిట్లని యహో బాపురే యెందుఁ
బంతంబువోనాడి పడఁతి దావలము, నంతకన్నఁ గొఱంత యనని వైఁగలదె
పాత్రంబు నెపమూని భావంబులోనఁ, బర్వుకోరికల నాపజ్జకువచ్చి
యక్కట నాచేత నాడింపఁబూని, చిక్కులఁ బెట్టఁజూచెద వేమొకాని
నీచొకారంబును నీజాణతనముఁ, జూచిన యమ్మాట చోద్యమై తోఁచె
సంతసంబున మున్ను నల్లకుఁబోయి, యుంత దాచినయట్లు మోమోటమేల
వలనొప్ప నృపుభోగవనితను గాని, తలఁప నే నీపినతల్లిని గాను
నీకుమారుఁడనంచు నిజమువల్కితివి, నాకు మారుఁడవె డెందమున భావింప
పాపంబునకు భీతిపడియెద వాస, వాపుటకన్నఁ బాపంబింకఁ గలదె
వలువనివావులు వరుసలుఁ దెచ్చి, కలిగిన మేలువో కడవెట్టు నెను
చేతికివచ్చునిక్షేపముఁ బార, వేతురే యేలాఁటి వెంగళులైన
కామించి తనపట్టిఁ గవసినయట్టి, తామరచూలికి తప్పేమిగలిగె
గురుపత్నిఁ గూడిన కువలయాప్తునకుఁ, బరికింప మఱియేమిపాపంబు వొడమె
దోసంబు మఱిదండ్రితోఁ బొందొనర్చు, వ్యాసపంయమి నేమి యాపదబెట్టె
గొదుగక మునికాంతఁ గూడినయట్టి, త్రిదశేంద్రు నేమిబాధించెఁ బంకములు
మేనత్తతోఁ గూర్మిమీఱ వేమాఱు, మీనకేతనుకేళి మెలఁగిన కృష్ణు
నెవ్వార లెగ్గుగా నెన్నికయిడిరి, కావున నీశాస్త్రకరతలు మాని
హాళి రాచిలుకవయాళి గయాళి, కేళి నేలుము కవుంగిట గదియించి.
అనవుఁడు నృపపుత్రుఁ డహహా యోయమ్మ, మునుదేవతలు చోద్యముగఁ జేసినట్టి
పనులు వారికి చెల్లుబడియయ్యెఁ గాక, మనుజుని కట్టు కేమాకెఁ బొసంగు
పరికింప వసుమతిపాలుని భోగ, తరుణిని గాని నీతల్లిఁగాననుచు
ధనశాస్త్రి వాకుప్రియధర్మంబె నీకు, శివశివా మఱివావిచెడ మందుగలదె
వేండ్రింపుఁబలు కిందువింటిమి గాని, తండ్రిగైకొనునింతి తల్లియకాదె
మారనిచలమూని యమ్మరో మిగుల, నాడడినిమట మేరా నీపనన్ను

కొను కెంపుటట్టులోఁ గ్రొన్ననపాను, పుననుంచి యందు నేర్పనవ్రాసినట్టి
చిత్తరురూపులఁ జేసన్న జూపి, బిత్తరి యతనితోఁ జేరి మ ట్లనియె.
మది జెలంగి కుమారమన్మథ చూడు, మదె నందనందనుం డర్మిలి నొక్క
కులుకుఁబ్రాయఁపు గొల్లగుబ్బెత గబ్బ, లలమిపట్టి నఖంబు లదిమినసొగసు
కనుఁగొను మదెయొక్కకలికితోఁ గృష్ణుఁ, డెనసి కౌఁగిట గదియించినబాగు
వీక్షింపు మదె యొక్కవ్రేతతో వెన్నుఁ, డిక్షుకార్ముకకేళి నెనసినలాగు
రాధ పైకొని యుపరతి సేయఁ జెలఁగు, మాధవు నదె చూడుమా ధరాధీశ
యిద్దఱుచెలులపాలిండ్లు హస్తములఁ, దద్దయు బిగబట్టి తమి నొక్కముద్దు
గుమ్మ క్రొందళుకుచెక్కులు ముద్దుగొనెడు, కమ్మవిల్తుని తండ్రిఁ గనుమదె మో
గాధిసూనుఁడు మేనకను గూడి పల్ల, వాధరంబానుట యల్లదె చూడు
దారుకావనమౌని దారలఁ గలసి, కేరెడు నదె చూడు గిరిసుతారమణు
నదె చూడు మునిపత్నినంటి జంభారి, మదనాహవమున నెమ్మదిఁ గేరు తీరు
తొడలపై రతి నుంచి తొడరి ముద్దాడు, నెఱవింటిదొర నదె వేడ్కఁ గన్గొనుము
గురుభామ యగు తారఁ గూడి సంభోగ, సరణిఁ దేలెడు నదె జాబిల్లి జూడు
రాజరాజసుతుండు రంభతోఁ గలసి, గాజుటోవరిలోనఁ గడఁక ననేక
చిత్రబంధంబులఁ జెలఁగెడు చొప్పు, ధాత్రీశ యల్లదె తప్పకఁ జూడు
మనుచుఁ జిత్తరురూపులన్నియుఁ జూపి, పెనచు మోహమున దూపిలుచున్న నతఁడు
తలవంచి మఱులనుత్తరమీక మసెని, గలకమీర పరాకుగానున్న నలికి
యలికి కేకులహాహాళికి చిల్కలర, వలికి గద్దరి పికావళికి పూఁబొదల
వలికి మందపుకరువలికి పేటాడు, కలికి రాయంచ తెక్కలికి చెంగలువ
చెలికి గాటపుసూడు చిలికి క్రొందమ్మి, ములికి ముత్తముల నిమ్మగగ్రుమ్మ
గులికి యార్చు కడింది కూళ యంకిలికిఁ, గలికి వోనులికి యక్కటకటా వీఁడు
చలిగూటిపై వెన్న సరణి నించుకయుఁ, జలియింపకున్నాఁడు జాగేలయింక
బలిమిఁ బైకొని యైన భావజు కేళిఁ, గలసి భోగింపక గాదని చూచి
కరకంకణధ్వనుల్ ఘంటారవములు, చరణమంజీరనిస్వనములుఁ జెలఁగ
గొదగొని నెత్తమ్మికొలఁకున కురుకు, మదము కేనుఁగగున్న మాడ్కి పైఁబడియె.
అటుల పైఁబడు బల్గయాళి ప్రియాలి, నటుదోఁచి గుండెఝల్లని విలిపౌర
హోపరమేశ మహాదేవ యనుచు, భూపసూనుఁడు సొమ్మబొంది వేతెలిసి
ప్రెగడబిడ్డఁడు మున్ను బెక్కుచందములఁ, దగిలి చెప్పినమాట తలఁపుననిడక
తవిరివచ్చుట కిట్టిదెసఁ జెందవలసె, నవనీశ్వరాజ్ఞఁ ద్రోయఁగవశం బగునె

యని దలయూఁచుచు నసురుసురనుచుఁ, గనుదోయికొనల వెక్కసముగ జాలు
కొనుబాష్పకణములు గోళ్లమీటుచును, తనువుగంపింప గద్గదకంఠుఁడగుచు
పెదవులుదడపుచు పెంపెల్లఁదూలి, కొదుగుచు దైన్యంబుగోరల నవ్వాలు
గంటిఁ గన్గొనిపల్కెఁ గటకటా యిట్టి, కొంటెతనంబుఁ జేకొనియెదేమిటికి
తల్లి పురంధ్రిమతల్లి యనంగ, నెల్లగా బ్రతుకుటయెల్ల మేల్గాదె
చేత మామిడిపండు చెదరంగనైచి, యాతలిమూసిడిపండ్లర్థించినట్లు
నిరుపమగుణుఁడైన నృపుని వంచించి, పరునిఁగామించుట పాడియె? నీకు
పరకాంతఁ దల్లిఁగాభావించు నేను, హరహర పినతల్లి నంటఁగోరుదునె
పరమేశునాన నీపదములసాక్షి, ధరణీశునాన నిన్ దలఁపనింతైన
నెరనెఱుంగక వట్టివేఁడివగుచు, ధర నపకీర్తిఁ జెందఁగఁగోర దేల
వినువినునాబుద్ధి వివరించిచూడు, పనివినియెద నింక పార్వంబునొసఁగు
మనుచు దిగ్గనలేచి యరుగనూహించు, జననాథసుతుని కేల్ సయ్యనబట్టి
గురుకుచ క్రిమ్మఱఁ గూర్చుండఁబెట్టి, దరిలేనిమదనవేదనలఁ గాసిలుచు
మాటికి వరదలై మానకతొరుగు, కాటుకకన్నీరు కడకుమీటుచును
కొలఁదికిమించు డగ్గుత్తికతోడ, నెలయు నెలుంగున నిట్లని పలికె.
ఔర మారునకు నన్నగ్గముచేసి, యూరకె జుడిగిపో నూహించెదేమొ
పిల్లిపట్టిన కోడిపిల్ల కెంతైన, నల్లన జుడిగిపోనగునె చర్చింప
గట్టిగా నిన్ను నాకౌఁగిటఁ బట్టి, బిట్టుమారునికేళి బీడించి కోర్కె
దీర కెందలిరువాతెఱపానకంబుఁ, జూఱలాడక మానసుమ్మి నీయాన
యెఱుఁగనేరవుగాక యెన్నిపుట్టువుల, తఱినబ్బు మకరకేతననిశాతాస్త్ర
జాలవ్యథాభిన్నసకలాంగు లగుచు, కేలఁ గపోలముల్ గీలించి పైని
గాలిసోకిన వెన్నకరణిఁ గరంగు, గోలలఁ గౌఁగిటఁగూర్చు భాగ్యములు
బహుయత్నములఁగుంది పడయంగరాని; మహిళావతంసంబు మరుకేళిఁగోరి
మక్కువతో బతిమాలిన వినక, విక్కిచిక్కులుబెట్టు నెంగలిగలఁడె
కోతికి నబ్బిన కొబ్బరిపంటి, రీతియైతోఁచె నీకీత యివ్వేళ
పడుకైనఁ గరఁగి వేబడనగుఁగాని, గడితంపునీమది గరఁగదయూరె
యేలరా రతిదేల్చియేలరా తాళ, జాలరా మదిలోనఁ జాలరాగిలితి
కూళరాచిలుకబల్ గుజ్జుపుజోదు, పాల రాపడనీక బ్రతికింపు మిపుడు
ప్రాణదానముకన్న బరమధర్మంబు క్షోణిలోఁగలదె నిక్కువమీవెఱుఁగనె
సారెకు దల్లియున్ శంకనొందకుము, వారకాంతల కెందు వావులుగలవె

నీవంటి సద్గుణనిధి కివ్విధమున, నావంటిచెలిసేఁత నాయంబుగాదు
ద్రోహినై యిప్పుడాసఁ ద్రోచితివేని, స్త్రీహత్య నీకిట సిద్ధించుఁ జుమ్ము
కావున నిఁకఁ బెక్కుకబదులు మాని. | కావు నన్మరుని కాకలఁ గుందనీక
యనుచు వాకిలిమూయ నటు నిటుఁ జూచు, వనితచొప్పెఱిఁగి భూవరసుతుఁ డపుడు.
పట్టినపంత మిప్పాపాత్మురాలు, గట్టిగా మాన దేకరణిఁ దెల్పినను
కామాంధకారంబు కన్నులఁ గప్పి, యేమియుఁ గ్రిందుమీఁ దెఱుఁగదు దీనిఁ
బోదవినఁ గందర్పభూతంబు నింక, వదలింప నేరికి వశముగాదనుచు
గుప్పునలేచి యెక్కువదిగుల్ మీఱఁ, దప్పించుకొని పోవఁదలఁచిన నెఱిఁగి
యప్పడంతుక వానికడ్డమై పెనఁగి, దుప్పటికొంగుఁ బొందుగ కేలఁబట్టి
యోనవు మేలు మేలౌర నీబుద్ధి, మానవుగద యెంత మంచి జేసినను
ఫలరసాస్వాదంబుపసయెల్ల ముద్దు, చిలుకగా కెఱుఁగునే చెనఁటికాకంబు
మృదుమరందము తావి మేలైన తేఁటి, కొదమగా కెఱుఁగునె గొంటుజోరీగ
కామినీసంభోగకలనాసుఖంబు, పామరుఁ డెఱుఁగునె బలుదంటగాక
వేమఱు బతిమాలి వేఁడిన వినక, సోమరివై రిత్తజూఁడుముగఁ జూచెదవు
కోమరుఁబ్రాయఁపుముద్దుగుమ్మ కౌఁగిటను, తమిఁ జెలంగని మగతన మదియేల
చెలువుఁడ కౌఁగిటఁ జేర్చి కెంబెదవి, పలుచని చక్కెరపానకం బాని
తళుకులే జెక్కుటద్దములు ముద్దాడి, యలరువిల్తుని కేళి నలరింపు మనుచుఁ
జేయెత్తి మ్రొక్కిన శివశివా యెంత, గయ్యాళితనమూనెఁ గలికి యటంచు
నాఁకొన్న పులివాత కబ్బిన కంచి, మేకచందంబున మెత్తబాటూని
యేమియుఁ దోఁచక నృపకుమారకుఁడు, పైమీఁది దుప్పటి పాఱంగవిడిచి
సరగున నవలికి చంగునదాటి, యరిగె రాహువుచేతి యాతనఁ బాసి
బొనర షోడశకళాపూర్ణుఁడై యెలమిఁ, దనరారు సారంగధరుని చందమున.
అటులేగు నృపతనూజాగ్రణిఁ జూచి, తనరఁగఁ జేతివిత్తము పోయినట్లు
మొగము వెల్వెలఁబాఱ ముఱియెల్ల సడలి, పొగలుచు వేడిమూర్పులు సందడింప
నుసురంచుఁ గొఱకొఱ యుప్పతిలంగ, బిసరుహానన పండ్లు పెటపెటఁ గొఱికి
యోరిటక్కరి కాన యోజలేకిట్లు, పారావతంబు నెపంబూని వచ్చి
రమణుఁబాసి విరాళిఁ గ్రాఁగుచో మిగులఁ, దమిరేఁచిచనెడుగదా తాళుతాళు
మంచిది కానిలే మాబాగు రాజు, వంచనలేక రావలెఁగదా నిన్ను
గట్టిగా నెన్నైనఁ గల్లలు చెప్పి, కట్టి నట్టడవిలోఁ గాళ్ళుఁ జేతులును
జెలపింపకున్న యిసీ మారుపేరఁ, బిలువర నన్ను నన్నిమ్మాట నింక

ననుచుఁ దర్జనిఁజూపి యదలించి పలుకఁ, గని గుండెలవసిపోఁ గాళ్ళాడ కతఁడు
నిలిచి యయ్యోతల్లి నీతప్పదెచ్చి, యళుకక నాపయి నంటించి కినుక
దండింపఁజూచుట తగవె నీమాట, పండగంబున నేమి ద్రోచితినమ్మ
కొలవచ్చుపని కియ్యకొనకుంటిఁ గాని, మెలఁతరో నీయాజ్ఞ మీరుట లేదు
నిముషసౌఖ్యమునకై నెరయదుఃఖముల, జముని చేఁబడలేక జంకెద నింక
విభుఁడును నీవు నెవ్విధి నొనర్చినను, శుభగాత్రి దైవాజ్ఞసు మ్మటమీఁద
తల్లివిషంబిడ్డ తండ్రిమ్ముకొనిన, నెల్లెడ మాన్పవా రెవ్వరు గలరు
సెలవిమ్ము పోయివచ్చెద మదిఁదల్లి, యలుగక దయయుంచుమని యటఁ దరలి
తమనగరున కేఁగి తజ్ఞుల రాచ, కొమరుల నిండ్లకు గొబ్బున బనిచి
యంతఃపురంబున కరిగి యత్యంత, చింతాసమేతుఁడై చెయివొంది నులక
కంకటిపైఁబడి కడయిడరాని, జంకున గుండియల్ ఝల్లుఝల్లనఁగఁ
బండుచు లేచుచుఁ బలవరింపుచును, కొండ పైఁబడ్డలాగున వ్రేగుగదుర
నుసురంచుఁ బొరలుచు నూర్పులు నిగుడఁ, బసచెడి దైన్యంబుఁ బొడుకొనంగ
నయ్యయో పార్వంబు నాకసంబునకు, నెయ్యంబుతో నేల నెగరవైచితిని,
వైచిన మఱల నావంకకురాక, యాచండిపులుఁ గేల యటతేలిపోయె
పోయెఁబో మఱియెందుఁబోవక యదియె, దాయదైయె చిత్రాంగిదరి నేలవ్రాలె
వ్రాలిన నట్టెపోవఁగనీక యేల, జేలనై దానికై బిరబిరఁ జనితిఁ
జనినఁ బార్వంబునొసంగ కాయమ్మ, మనసునఁ గొఱగానిమాటల దలఁచె
తలఁచినఁ గాదని తప్పించుకొనిన, నలిగి దండించఁగ ననఁగ నేమిటికి
కొఱమాలి విధి యెన్నిగొడవల నిడిన, నెఱిఁగి పోనిడుకొన నెవ్వరితరము
మంచిది విధుకళామాళి యేరీతి, నుంచిన నారీతినుండక తీర
దాయమబాధనం దడలుటకన్న, నీయమబాధ నిందేమైన లెస్స
యనుచు డెందమున మహాదేవు నభవు, నునిచి తద్దయు ధైర్యమూనుకొనియుండె.
అక్కడఁ జిత్రాంగి యాత్మలో మిగుల, నక్కుమారకుని యొయ్యారంబుఁ దలఁచి
హా వాఁడు నావల పాఱడిఁజేసి, భావజున్మనిబారిఁ బడఁద్రోచి చనియె
మధుకరంబులకు మన్మధశరంబులకు, మధు పరభృత కీర మందసమీర
విధుకరంబులకు నెవ్విధిఁ దాళుకొందు, విధియొదవించు బల్వెత కేమియందు
నేమి సేయుదు నింక నెటువలె నోర్తు, నీమహావిరహాబ్ధి నెబ్భంగిఁగడతు
నమ్మక చెల్ల నాయట్టి సుందరికి, యమ్మోహనాంగుపొం దలవడ వలదె
మరుఁడు వేలుపురాకొమరుఁడుఁ గురంగ, ధరుఁడుఁ గుబేరనందనుఁడును వాని

కాలిగోరున బోలఁగలరె యయారె, చాల నెన్నికఁగన్న జగవన్నెకాఁడు
వానికౌఁగిటిలోన వదలకఁ గదిసి, సూనచాపునికేళిఁ జొక్కక యున్న
యీజవ్వనంబేల యీసొగసేల, యీజగరంగేల యీశివియేల
కటకటా వానితోఁ గట్టడినలువ, కుటిలుఁడై యేటికిఁ గూర్పకపోయె
ననుచు నగ్గలమైన యంగజవ్యథల, మునుఁగుచుఁ బలుగోరములఁగుంద నపుడు
ముద్దుగుమ్మకు శిలీముఖమయ్యె తేఁటి, తద్ద యాశుగమయ్యెఁ దరుణికి గాడ్పు
కలికికి పుండరీకంబయ్యె తమ్మి, పొలఁతికి సురపొన్న పున్నాగమయ్యె
శరమయ్యెఁ జెలికి కొజ్జంగిపూనీరు, హరిణేక్షణకు బర్హియయ్యెను నెమ్మి
యతివ కగ్నిశిఖాంకమయ్యెఁ గుంకుమము, సతికిఁ గప్రము ఘనసారమైయొప్పె
మఱియు గాటంపుటుమ్మలికెల్లఁబెలయ, తెఱవ మెల్లనె సోలి తెలివొందిసారె
హరహరయంచు రామాయంచుఁ జక్రి, ధరయంచు మకరకేతనకోకిలాని
లసులదాడికి లోఁదలంకి పల్కుచును, గమకమై తద్దయు గాటమై మదిని.
బెనఁగొను కినుకచే బిరబిర లేచి, మునుకొని మేనిసొమ్ములు దీసివైచి
కలుకుగుబ్బలు వాడికొనగోళ్ల నెత్తు, రులు జాలువారంగ గ్రిచ్చిద్రిచ్చుకొని
పొసఁగ దట్టఁపు మైలపుట్టంబుఁ గట్టి, నొసలఁ గస్తురిబొట్టు నూల్కొనఁ బెట్టి
తలను వాసెనగట్టి తడయక కట్టి, బలుచీఁకటింటిలోపల నొకమూల
నిలఁబడి మూల్గుచు నెనలేని వెతలఁ, బొలయుచు నుసురంచుఁ బొరలుచునుండె.
ఆలోన వనికి వేటాడంగ నేఁగి, వ్రాలినకడిమిమై వర్తిలుచున్న
రాజమహేంద్రధరాతలాధీశుఁ, డాజగన్మోహినియైన జిత్రాంగి
చెలువాత్మఁదలఁచి కెంజివురువిల్కాని, ములికిమొత్తముల బాముల కోర్వలేక
కలఁగుచు రేయెల్లఁ గడపి వేకువను, తలకొను వేడ్క నత్తాఘున దరలి
దొరలగ్రమునఁ జెల్మిదొరలమెలంగఁ, గరము పెల్లున భటోత్కరము జెలంగ
గడలసామరులు నల్గడలవర్తింప, పడగలవార్మను పడగమియింప
గములుగూడుకొ తురంగములపై నెక్కి, కొమరుఁబ్రాయఁపురాచకొమరులు నడువ
వంతులనెక్కి మావంతులు మత్త, దంతులపై మహోద్ధండత నలరఁ
బసిఁడిబెత్తులవారు బలసియిర్వంకఁ, బసనెసంగుచు బరాబరు లొనరింప
తురగరింఖాసముద్ధూతప్రభూత, ధరణీపరాగంబు తపనునిగప్ప
భేరులు తుడుములు పెద్దబూరలును, వీరకాహళికలు విప్పుగా మొరయ
నాలపట్టములు ముత్యాలవెల్లులును, జాలువాయరిగెలుఁ జామరంబులును
గొనియాడి గీలుడాకొన వెంటరాగ, నెనలేని బలుకీవి యొసఁగ నేతెంచి

మణికేతనముల హేమనికేతనముల, గణికాగమణుల ముక్తాహారమణుల
జవఘోటకముల నుజ్జ్వలహాటకముల, నవతోరణముల నున్నతవారణముల
వనజాలకముల కేవలజాలకముల, ఘనవితానముల సత్కవివితానముల
రాజమార్గముల నీరంధ్రదుర్గముల, వాజిశాలికల సువర్ణడోలికల
నసమసౌధముల దివ్యావరోధముల, ప్రసవవాటముల శుంభత్కవాటముల
భద్రవాద్యముల నేపథ్యచోద్యముల, శూద్రనాయకుల నక్షుద్రగాయకుల
నృపతనూభవుల నిర్ణిద్రవైభవుల్, విపణిపద్ధతుల సంవృతబలోద్ధతుల
శ్రుతినాదముల విశ్రుతవినోదముల, క్షితిసురావళుల నంచితమహాకులుల
వివిధవర్తనులఁ బ్రవీణనర్తకుల, సవనధామముల యోషాలలామముల
సరిదనీకముల శశ్వత్తటాకముల, వరతపోధనుల భాస్వరవణిగ్జనుల
ననయంబుఁ గడుమనోహరలీల నెలసి, తనరారు తనరాజధాని సొత్తెంచి.
వందిమాగధులు కైవారముల్ సేయఁ, గ్రిందుగా నర్తకీగణము నర్తింపఁ
గలధౌతపాత్రిలఁ గప్పురంబుటార, తులునించి పుణ్యాతథుల్ నివాళింప
నెలరాల మేడల నిలిచి నాడెంపు, బలువల ముత్యాలసేసలు జల్ల
తొడరి సోరణగండ్ల త్రోవల రాచ, పడతు లీక్షించుచు భళిభళియనఁగ
నాగమోక్తముగ ధరామరోత్తములు, మూఁగియాశీర్వాదములు బొనరింప
నుడుగక నాగరు లుడుగరలిడుచు, బొడగనశుభతూర్యములు బిట్టు మొరయ
కొలువుకూటముసొచ్చి కొంతసేపచటఁ, గొలువుండి యెల్లఱ గొబ్బునబనిచి
యంతఃపురంబున కరుదెంచుటయును, జెంతల నుడిగెంపుఁ జేడియల్ డాసి
తరలసంపఁగినూనె దలయంటె రాజ, తిలకంబునకు వధూతిలక మొకర్తు
నలువగాఁ గస్తురినలుగిడె నొక్క, తలిరాకుఁబోడి భూతలమహేంద్రునకు
కల్లయగంధామలకంబిడె నొక్క, కలికి నృపాలశేఖరుని యొదలను
చాలుగొజ్జెఁగనీట జలకంబులార్చె, కలకంఠకంఠయొక్కతె నృపాగ్రణికి
తడియొత్తె నొక్కపుత్తడిబొమ్మ యొంటి. పడఁతుక వసుమతీపాలముఖ్యునకు
వలిపెమడుంగుపల్వలు గట్టనిచ్చె, జలజలోచన యోర్తు సార్వభౌమునకు
కలపంబు మేనిండఁ గలయనలఁదె, బాలఁతిమిన్న యొకర్తు భూనాయకునకు
చేరి క్రొవ్విరిసరుల్ సిగఁజుట్టె నొక్క, వారిజేక్షణ ధరావరకుంజరునకు
నవరత్నమయభూషణము లలరించె, పువుబోడియోర్తు సొంపుగ మహీపతికి
పసిఁడిపళ్లెరమున భామినియోర్తు, రసిరసాన్నములిడె రాజన్యమణికి
యెంగిలివార్వ నీళ్లిడె నొకమోహ, నాంగి పొంగి మహీభృదవతంసమునకుఁ

జగమున నీవంటి సరసురా లెందుఁ, గనపడదని సారె కాత్మలోఁ దలఁతు
కలికి నీపాలిండ్లు గజనిమ్మపండ్లు, పొలఁతి నీకెమ్మోవి పూదేనెబావి
చాన నీనెమ్మోము జాబిల్లిగోము, మానిని నీకురుల్ మరునివాగురులు
వనిత నీనూగారు వలిదేటిబారు, వినుతాంగి నీబొమల్ వెడవింటికొనలు
చెలియ నీమీఁగాళ్లు చిన్నితాంబేళ్లు, మెలఁత నీమేసౌరు మేల్మిబంగారు
మమ్మ నీకెనయైనమగువ లేదెందు, మమ్మరసేయక మక్కువఁ జూడు
వలరేని దాడికోర్వఁగజాల నింక, చెలిమితోఁ గౌఁగిటఁ జేర్చి రక్షింపు
ముగుద నీకెమ్మోవి ముద్దొసంగినను, పగడంబులును మంచి పలుగెంపు లిత్తు
నతివ నీవేనలి యంటనిచ్చినను, ప్రతిలేని వేల్పురారతనంబు లిత్తు
చెలువ నీచెక్కులు చేముట్టినపుడు, కలుకవజ్రపురాలు కానుకలిత్తు
ననబోఁడి ననుఁజూచి నవ్వినయపుడె, యనువొప్ప ముత్యాలహారంబు లిత్తు
కులుకుగుబ్బలు గోర గ్రువ్వనిచ్చినను, వలనొప్పఁ బలుజవాబంతుల నిత్తు
చలముమానవె యింక చక్కెరబొమ్మ, మొలకనవ్వులఁజూడు ముద్దులగుమ్మ
తాళఁజాలనుసుమ్మ తలిరులేఁగొమ్మ, మేలమేటికి లెమ్మ మినుకుపూరెమ్మ
కామునేలింపవె కపురంపుదిమ్మ, వేమరు ననుఁబ్రోవు వెలలేని సొమ్మ
యనుచు మోహము నిల్పనలవిగాకున్న, ఘనతర మాణిక్యఘటిత కిరీట
చటులకాంతిచ్ఛటల్ జగతిపైఁ బర్వ, నిటలంబువంచి తన్వికి మ్రొక్కులిడియె.
అటుల మ్రొక్కిన నగ్గయాళిపొలంతి, పటుగతిఁ దనదుకాపట్యంబు నెఱప
నిదెయదనంచు లోనెంచి యించుకయుఁ, గొరుగక రాజన్యకుంజరుండులుక
నుసురఁచు వేడినిట్టూర్పు నిగుడ్చి, మునుఁగు మెల్లనెతీసి మూల్గుచు నేలఁ
గేలూనుకొని లేచి కెంగంటఁజూచి, వాలుఁగన్నులనీరు వరదలై పాఱ
గొడవలు బెరయ డగ్గుత్తికమీర, బుడిబుడి నెడయేడుపులు దోఁపఁ బలికె,
జననాథ వేటకుఁజని నీవరణ్య, మునను న్నచోఁ బొద్దువోక రాచిలుకఁ
గరముఁబూని బంగరుమేడమీఁద, నిరవుగాఁ గ్రీడించునెడలఁ బ్రాతేయ
కరరేఖయో యనంగా దివినుండి, పరువడి నెకవెల్ల పార్వంబువచ్చి
చెంతవ్రాలినదానిఁ జేకొనిమెలఁగు, నంతలో కడిదియొయ్యారంబుమీఱ
పారావతంబు నెపంబున నిటకు, సారంగధరుఁడు వేఁ జనుదెంచి నన్ను
గనుఁగొని యత్యంతకామవికార, మున మేనెఱుఁగక ముదమునఁ బలికె
మొలకపుత్తడిబొమ్మ ముద్దులగుమ్మ, వలపుగొజ్జఁగిబంతి వన్నెలదొంతి
యాముటేనుఁగగున్న యన్నులమిన్న, గోములనడుదీవి గుజ్జులేమావి

పూఁపవెన్నెలనిగ్గ పొగడపూమొగ్గ, కైపుమీరినసొమ్మ కడిఁదిరాకొమ్మ
సోయగంబులప్రోక సొగసులవాక, కాయజువిరిచిల్క కలికిరాచిల్క
నీరూపు నీయేపు నీముద్దుజూపు, నీరంగు నీయంగు నీమేల్ హొరంగు
నీయొప్పు నీచొప్పు నీజాణతనము, నేయన్నులకు నైన నిలనెన్నఁగలదె
వనిత నీకే జాలవలచితి నింక, ననవింటితులువ చే నలియంగనీక
నీకవుఁగిటఁగూర్చి నేడు నన్ బ్రోవు, చేకొను పుణ్యంబు చెలిమిఁ గైకొనుము
రాకేందువదన శారదమందహాస, కోకిలకలవాణి కుందాభరదన
మదమధువ్రతవేణి మలయజామోద, మృదుమధురసల్లాప మృగరాజమధ్య
పరిపక్వబింబోష్ఠి పల్లవపాణి, ధరనిభోజ్జ్వలకంఠి తారకానఖర
లికుచవక్షోజ నాళీకపత్రాక్షి, ముకురకపోల జాంబూనదగాత్రి
కుసుమకోమలి హేమకుట్మలనాస, బిసబాహువల్లరి పృథుతరజఘన
భుజగరోమావళి పులిననితంబ, గజరాజగామిని కచ్ఛపప్రపద
కార్ముకభ్రూవల్లి కరభోరుకాండ, నిర్మలాభోగతూణీరోరుజంఘ
శ్రీకారకర్ణసరిన్నిమ్ననాభి, కోకనదోల్లస త్కోమలచరణ
యనుచు నగ్గలపుమోహమునఁ బ్రార్థించు, చెనఁటిపైఁ గన్నెఱఁజేసి యిట్లంటి
నోరిదురాత్మ నాయొడయండు వనికి, దూరమేగు టెఱింగి తుఱ్ఱునవచ్చి
పినతల్లియనక ముప్పిరిగొనుతమినిఁ, బెనఁగఁజూచెదు గ్రొవ్వపెల్లున నహహ
మానంబు ప్రాణంబు మనుజేంద్రుసొమ్ము, గానెంచి మెలఁగునైఖరిదాన నేను
నీవంటితులువమానిసిఁ బొందఁగలనె, పోవు మూరకె కానిపోకలఁబోక
యనియదలించిన నడఁగక వాఁడు, ఘనతరకామాంధకారంబు దొట్టి
బలిమిఁ బైకొని బట్టి బాములఁబెట్టి, కులుకుగుబ్బలుం వాడికొనగోళ్లవ్రచ్చి
కాఁగలపనియెల్లఁ గడతేర్చి పిదప, నేఁగె సన్నకసన్న నింకేమిచెప్ప
పొదలుముంజేకడంబున కద్దమేల, యిదె చూడుమంచుఁ బయ్యెదవాపి చూపి
కొమరుఁ డంటినవాఁడె కోడలనైతి, తమినింక నీవంట ధర్మంబుగాదు
రతిసుఖంబులఁదేల్చు రత్నాంగికడకు, క్షితితలాధీశ వేంచేయు మూరకయె
యీవిధమెల్ల నీకెఱిఁగించుదాక, నోవసుధాధీశ నోర్చితి నింక
ననుఁజూడుమంచుఁ గ్రన్నన ఱేనిచేతి, నునువాలువెఱికి గొంతుకఁజేర్ప నళికి
వనితకేల్ వట్టి యవ్వాల్ విడిపించు, కొని జననాథుఁ డక్కొమ్మ కిట్లనియె.
మెలఁతరో నాయాజ్ఞమీఱి నిన్నిట్లు, గలఁచిన కైలాటకానిఁ గుమారుఁ
డని మదిఁగనికరం బరయక శిక్ష, యొనరించి నీమది యుడుకెల్లఁ దీర్తు

నాహా జగన్మోహనాంగి యుబ్బంగి, సాహసం బొనరింపఁ జనునె నీకిపుడు
నాయట్టి భూలోకనాథునిఁ జెంది, తోయజానన యింత దుఃఖింప నేల
రాజువట్టినయ్యింతి రంభయన్మాట, యీజగంబునఁ బెద్దలెన్నఁగా వినవె
నామహారాజ్యంబు నామణిద్రవ్య, హేమచామరహయానేకపాదికము
లెల్లను నీసెకావే పరికింప, చెల్లంబొ నీయాజ్ఞ చెల్లుటలేదె
ననబోడి నీవు గిన్కనుఁ గీడుబొదవ, నినుఁ బాసి క్షణమైన నేనోర్వఁగలనె
వాఁడుచేసిన ద్రోహవర్తనంవాని, పొందియూచ్చెదుగాక పొగలేల నీకు
వనజాక్షి ననుఁజూడు వగపెల్ల వీడు, మని యూరడిలఁబల్కి యపుడె శుద్ధాంత
మునకేఁగి యొకయోరమున మేనుజేర్చి, మొనయు చింతాభరంబున వ్రేగుచుండె.
అని నిరంతర సద్గుణావాలు పేర, ననవద్య దానవిద్యాలోలు పేర
శమన దుర్గర్వాపశమనుని పేరఁ, గమనీయగోరాజగమనుని పేర
తరుణేందురేఖావతంసుని పేర, నరిదైత్యకులతమోహంసుని పేర
సురవాహినీజటాజూటుని పేర, గురుతర శ్రుతికూటఘోటుని పేర
తపనీయశైల కోదండుని పేరఁ, దపనప్రతాపదోర్దండుని పేర
నగతనూజామనోనాథుని పేర, యుగపదాహ్వాత శత్రుయోధుని పేర
దూరితాఖిలఘోరదురితుని పేర, సారపుణ్యోదయచరితుని పేర
సింధురాజినదివ్యచేలుని పేర, బంధురామర లోకపాలుని పేర
భుజగకులేంద్రవిభూషణు పేర, సుజనదరిత్రితాశోషణు పేరఁ
బ్రతిదిన కైలాసభవనుని పేర, నతితరాఖిల జగదవనుని పేరఁ
బురహరు పేర శంభుని పేర భక్త, వరదుని పేర సర్వజ్ఞుని పేరఁ
జిరతరమోక్షలక్ష్మీప్రదు పేరఁ, గరుణాత్ము పేర శంకరు పేర సుగుణ
మహితుఁ డంచిత కూచిమంచివంశాబ్ధి, తుహినభానుఁడు బుధస్తుత్యచరిత్రుండు
ఘనయశోన్వితుఁడు గంగనమంత్రిమౌళి, తనయుఁడు తిమ్మసత్కవి రచియించి
తమినిడ్డ సారంగధరచరిత్రమున, నమరంగ నిది ప్రథమాశ్వాసమయ్యె.

శ్రీరస్తు.

# సారంగధరచరిత్రము.

## ద్వితీయాశ్వాసము.



శ్రీకరగుణసార చిరశుభాకార, భీకరరిపుదూర ప్రథుతరోదార
కైలాసనిలయ శంకర మహాదేవ, నీలకంధర యీశ నిఖిలలోకేశ
యవధరింపుము వేడ్క నలరాజరాజు, దవిలినవంత నంతటఁ గొల్వుకూట
మునకేఁగి మంత్రుల బుధుల దీర్పరుల, జనవరులఁ జుట్టాల సంగడికాండ్రఁ
బనివడి రావించి భావంబులోన, నెనయుసంశయమున నించుకదడవు
చింతించి చెప్పక చెల్లదటంచు, నంతటఁ దమకుఁ జిత్రాంగి దెల్లమిగఁ
జెప్పిన తెఱఁగెల్లఁ జెప్పి మీరిప్పు, డిప్పని కేద్ది వాగె తీఁగింపుఁ డనిన
వారలందఱుఁ దలల్ వంచి మాటాడ, నేర కబ్బురపాటు నివ్వటిలంగఁ
గనవినరాని దుష్కర్మ మిదెట్టు. లనిన దోసముచెందుననుచు నొండొరుల
ముఖములు గనుఁగొంచు మొగిబహిర్దేశ, లిఖితచిత్రాకారలీలల నుండి
రందు నయార్ణవుం డను మంత్రితిలకుఁ, డందఱువినంగ నిట్లనియె రాజునకు.
అవనీశ యిట్టిఘోరమగు పాతకంబు, దవిలివాకుర్వ్వను దలపంగఁ గూడ
దేజాతులందు ముందేకథలందు, నేజగంబునఁ జూడ నిట్టి దుర్వృత్తి
పరువడి దననీటు పచరింపులోన, ... ...
దలఁచిన దొలుతటి తప్పొనొకాదొ, జలజాక్షి యారకే సవతియీరసముఁ
గైకొని చంపింపఁ గల్లలుగూర్చెఁ, గాక యిమ్మాట నిక్కంబేయటన్న
గలికిచే నదియెల్ల గట్టిగా మీరు, దెలుసుకొన్నదిగాదె తేటతెల్లమిగ
తులువలాడురుగదా దొరబిడ్డ నెందుఁ, బలుకు తేమిటి కింకఁ బనిపప్పె జుమ్మీ
పండెనీసిరి చేటువాటిలెఁ గొలలు, నిండె నింటఁ గులంబు నీరురావలసె
తలకొనె నపకీర్తి తప్పె ధర్మంబు, తలవంపులయ్యె నందఱిలోనఁ జాల
చులుకనైతోఁచె నిప్పొ దొరతనము, పలచనయ్యెను వాసి పరిజ్ఞులడంగెఁ

గావున గొడుకగక కనికరపడక, భూవర పినతల్లిఁ బొదవిన ఖలునిఁ
గొడుకింతయును లేక ఘోరవ్రణంబుఁ. గదిసిన యంగభాగంబును బోలె
ఖండించి తేజంబుఁగను మిట్టుగాక, దండించి పోఁదోలఁదలఁచితివేని
కడుజబ్బుపడుఁజుమ్ము కార్యంబులెల్ల, నిడుమ లంతంతకు నెడపక పొడవు
ననవిని మతిమంతుఁ డనుమంత్రితిలకుఁ, డనుపమనయశాలి యప్పుడిట్లనియె.
జననాథ యిదిశాస్త్రసమ్మతిగాదు, ధనము బోయిన మనస్తాపంబొదవిన
దనయింటఁ గానివర్తనమ్మొకటైన, ఘనులకు వెలిసేయఁగాదండ్రు బుధులు
పినతల్లులిండ్లకుఁ బృథివి నెందైనఁ, జనవునఁ గొడుకులు చనుటేమితప్పు
తమతప్పు మగవారితలఁబెట్టి యుండ, గమున బొంకులుపల్కి కారింపఁజూతు
రతివల డెందంబులరసి కన్గొనఁగ, క్షితిలోన నేరికిఁ జెల్లదు సుమ్ము
మనెనుంచుటొక్కటి మరియాడుటొకటి, కదిసియొనర్చుటొక్కటి తొయ్యలులకు
కపటంబెకాని నిక్కంబింతలేదు, చపలనేత్రల నమ్మఁజనదు నృపాల
తనయునినైన సోదరునైన మఱియు, జనకునినైన ... ...
తిలకించిచూచుచోఁ దెఱవలకెల్ల, జిలజిల మరునిల్లు ... ...
హరితోడ ద్రౌపది యాడదా మున్న, పరికింపనటులె యిప్పడఁతియు నతని
గొనబుగన్గొని పొందుఁగోరిన నియ్య, కొనక వచ్చుటఁజేసి కొఱకొఱపూనె
ఖండింపఁదలఁచి యీకల్లపుట్టించె, నొండెద్దియును గాదహోవివరింప
నొండుగొండైమెఱుంగ కుందడుగోల, బందుసేయదలంచె పడఁతియిట్లాడె.
నింతియెకాని యదింతియెకాని, వింత యింతయు లేదు వినువానివలన
సారంగధర కృపాసంజాతుఁడైన, సారంగధరుఁ డిట్టిజాడలవాఁడె
నెలఁదిబొంకుట గోడవేసినయిట్లు, ... మగబొంకు దడిగట్టినట్లు
ననుమాట మును పెద్దలాడంగ వినవె, తనయునివలన నేతప్పును లేదు
వనితమాటలు వినివలపాఱఁ గన్న, తనయునిఁ జంపింపఁదలఁచెద వేని
కైకమాటకు రాముఁ గానలకనిచి, శోకార్తిచేఁ జాలనుడ్కిన పంక్తి
రథుని తెఱంగున రాజేంద్ర నీవు, పృథుశోకములపాల భీతిలెదుసుమ్ము
నావిని పెద్దలందఱు మతిమంతు, నావినీతికి మెచ్చి యవునవు ననిరి
కార్యనిశ్చయబుద్ధి గలుఁగక భూప, వర్యుఁ డూరకె తలవంచుకయున్న
నారసికాగ్రిణి యనుమానసరణి. యారసి నీతిజ్ఞుఁ డనుమంత్రి పలికె
మనుజవల్లభ మతిమంతుని బుద్ధి, వినఁదగుఁగాని ... యేల వలదు
ననబోఁడిమాటలు నమ్మికచేసి, తనయుని వధియింప ధర్మంబుగాదు

తగువారిఁ బనిచి యాకనినడిగింపు, మగపడుఁ దద్వృత్తంబంతయు నప్పుడు
మాటలవరుసవెంబడినె కర్ణంబు, తేటతెల్లంబుగాఁ దెలియంగవచ్చు
దుడుకుచేసితివేని దోసంబు వొరలు, చెడుఁబ్రయోజనమెల్ల సిద్ధంబునమ్మ
నావుఁడు వసుమతీనాయకుఁడటులె, వేవేగఁ దద్దయు వెరవరులైన
పెగ్గడలఁ బనిచిన బిఱబిఱ వారు, జగతీవరాత్మజు సమ్ముఖంబునకుఁ
జనిన నాతఁడు గుండెఝల్లని వారిఁ, గనుఁగొని యడలుచు గద్గదకంఠుఁ
డైపల్కె నిపుడు మీరందఱు నిచటి, కేపని యెదలచూహించి వచ్చితిరి
తెలియఁజెప్పుఁడటన్న దిగ్గనవారు, పలికిరిట్లు పాణిపద్మముల్ మొగిచి
నరనాథతనయ విన్నవిభుఁడు వేట, కరిగినచో నీవు పోలిఁ జిత్రాంగి
లోగిలిఁజొచ్చి యాలోలాక్షి హర్మ్యాల, లోగివరాసక్తి లోగిలిఁగొనఁగ
నతిముతికేళికి నర్థించుటయును, తెఱవ యించుకయైనఁ దెఱవిడకున్న
సారసశరశరాసారసంఘాత, భూరివ్యథాపరాభూతుఁడవగుచు
బలిమి కౌఁగిటఁబట్టి బాములఁబెట్టి, తొలఁగివచ్చితటంచుఁ దొయ్యలి దొరకు
వెఱగుమీఱఁగ విన్నవించిన నతఁడు, కొఱకొఱతోడ నిద్దోడుకని యనక
సమయింపఁబూని నిజంబుఁ గల్లయును గ్రమమొప్ప నిన్నడుగఁ బంచెనమ్మ
కలచందమెల్ల నిక్కంబుగ మాకు, దెలియఁజెప్పుమటన్న ధృతిచెడి యోన
మశ్శివాయ చలంబుమానక యెంత, దుశ్శీలమున కింతి దొరకొనెనంచు
శ్రుతియుగళంబు మూసికొనియె కొమరుఁ, డతిమృదూక్తుల నిట్టులనియెవారలకు.
వినుఁడయ్యలార నావిన్నపం బిపుడు, జనపతి వేటకుఁ జన్నపిమ్మటను
నాతోడిరాజనందను లెందఱొచ్చి, ప్రీతినాటలకునై పిలిచిన నరిగి
బారావతంబులఁ బందెంబునరసి, తారాపథమునకుఁ దమకంబుతోడ
నెగయవైచిన దద్దయేపున నేఁగి, మగుడక నాచేతి మతకరిపులుఁగు
చిత్రాంగి నగరుఁజొచ్చిన నప్పయోజ, పత్రాక్షి యాపుల్గుఁబట్టి దాచటయు.
పినతల్లియని మదిఁ బెద్దయునమ్మి, చనువున నచటికిఁ జనిననయ్యమ్మ
వలపాఱ ననుఁజూచి వలరాచపనికిఁ, బిలిచినఁ గాదని పెనఁగివచ్చుటయు
నాతప్పు నీమీఁద నట్టోనరించి, జేతులుఁ గాళ్ళును జెలపింతుననుచు
కినుకతోఁబలికిన గిజగిజలాడు, కొనుచు నింటికివచ్చి కొంకుచునుంటి
తల్లి నాపైపెట్టి తప్పిడినపుడు, చెల్లించి విభుఁడది చెవిఁబెట్టినపుడు
నేనెఱుంగనటంచు నేమనుల్ పలుక, మానిపోవునె రిత్తమాట లేమిటికి
తెఱవమాటలకు ధాత్రీవిభుఁ డలిగి, యరుగఁబంచిన నేమి యనఁగలవాఁడ

భూతలేశ్వరుఁడ నఁ బోఁచు దైవంబు, మాతల్లిరత్నాంగిమారు చిత్రాంగి
యని డెందమున ననయంబు భావింతు, విను డిందులకుఁ బరదేవ్వషియె సాక్షి.
జగతీతలంబెల్ల శాసించురాజు, తగవుదప్పక ధర్మతత్పరుం డగుచు
తిర మెప్ప దేవభూదేవతాగ్రమునఁ, బరిశోధనము చేసి పట్టి గట్టిగను
తప్పు గల్గినచోట దండించుమనుడు, తప్పక శుభములు దలకొనుననుడు
దిటముగా మఱల నత్తెఱఁగ నెయ్యడిగి, పటుగతి నిజమెల్లఁ బరికింపుమనుడు
పొందు మీరని వస్త్రభూషణావళులు, దండుగా నొసఁగి పుత్తెంచిన వారు
ధరణీశుకడ కేఁగి తమకు సారంగ, ధరుఁడు జెప్పినరీతి తప్పకఁ జెప్పి
యధిప కుమారునం దరమరదలఁచి, వధియింపఁగూడ దన్వనిశనే మఱల
గట్టిగా బెదరించి కల్లయు నిజముఁ, బట్టఁబోలునటన్న పార్థివేశ్వరుఁడు
మంచిది మీ రన్నమాట చొప్పనవె, కొంచక మఱియు నక్కొమరుఁ దెలుసు
కొందము రండని గొబ్బునవారి, నంద ఱదుర్కొని యటకేఁగుటయును.
కనుఁగొని చిత్రాంగి గద్దియడిగ్గి, కనుదోయికొనల వెక్కసముగఁ జాలు
కొను వేఁడికన్నీరు గోళ్లమీటుచును, తనువ్రణాంక ముగ్ధయుఁబోలె మేలి
ముసుఁగు చక్కఁగఁదాల్చి, మోమరవంచి, పసిఁడికంబము నీడ బాగుగ నిలిచి
యున్నఁ గన్గొని పెద్దలుమ్మడినప్పు, డన్నెలవేణి కిట్లని వచియించి
రమ్మరో నిన్న మీయండకుఁ బారు, వమ్మ నెపంబున వచ్చి పోయగను
దైవార సారంగధరుఁడు కామార్తి, ... ... ...
... ... ... జేయ వే మిమునంటి చెయినట్టి దుండ
గముచేసి నీరాజుగారితో మీర, లమితాగ్రహస్ఫూర్తి నాడితి రనుచు
కినుకతోఁ బతి వానికేవకు మమ్ముఁ, బనిచిన నేఁగి యేర్పాటుగాఁ దెలపి
వచ్చితిమనుచుఁ దద్వాక్యముల్ పూస, గుచ్చినరీతి నక్కొమ్మకుఁ దెలిపి
వనిత యక్కొమరునివలన దోసంబుఁ, గనుఁగొన నింతయుఁ గనరాదు నీవు
నిజముగా విప్రసన్నిధి నున్నమాట, గజిబిజి సేయక గట్టిగాఁ బలుక
దబ్బరలాడిన దైవంబు నిన్ను, గొబ్బున నిడుమలఁ గుడిపింపుఁ జుమ్ము
కొమరునిపై వట్టిగొడవలు బెట్టి, సమయింపఁదలఁచుట చనదు ...
... యతోధర్మస్తతోజయం బనియు, తలఁచిచూడఁగ నాన్నృతాత్పాతకంప
రమ్మనియునుఁ బలుక్రమములు వినవె, కొమ్మరో నీవు గన్గొనని శాస్త్రములుఁ
గలవె యటన్న నక్కలికి లోనులికి, యలుకమీరఁగ వసంతాగమారంభ
లలితరసాల పల్లవరసాస్వాద, కలనాకషాయిత కంఠసోత్కంఠ

కలకంఠకులవధూకాకలిధ్వనులు, నెలుగెత్తి యేడ్చుచు నృపున కిట్లనియె.
ఓ రాజ నన్నింత యుడికింపనేల, గారాబుకొమరునిఁ గాదనలేక
యూరెల్లఁగూర్చి యనో రట్టుసేయ, మేరయె వంతల మిడికెడుదాని
తలవంపులయ్యె నందఱిలోన సిగ్గు, దొలఁగె మానంబెల్ల ధూళిపడంగె
మానహీనంబైన మానిని బ్రతుకు, మానవేశ్వర యంతమాత్రి మూహింపు
చెల్లంబొ నేడు నాచెంత నీకింత, యెల్లిదమై తోఁచె యిటులఁ బల్కురు
కతకుకాళ్లను మఱి కడవకుఁ జెవులు, నతకఁ జూచెద విఁక నందఱిలోన
గన్నులు నల్లఁగాఁ గనుఁగొను మిపుడు, పన్నుగా మఱియొక్కపాలి యటంచు
గన్యాన కరిమురిఁ గాల్చదిప్పుచును, గయ్యాళి పయ్యెదఁ గడకొత్తివైచి
పులిగోళ్లగ్రిమ్మెడు సొగడు సిబ్బెంపు, వలిగుబ్బగవమీఁది వ్రయ్యాలు జూపె
చూపిన దలలువంచుకొని యందఱును, హాపరమేశ్వరాయంచు నున్నంత
నిదియును దబ్బరయే చూడుడంచు, ముదిత దుప్పటిఁ దెచ్చి ముందఱఁ బెట్టి
యగయంగ నివ్వల్వ యతనిదో నాదో, వెఱవొప్ప మీరెల్ల వివరించి చెప్పు
డనుటయు నిఁక సంశయంబేల రండు, పనిలేదు తడయ నిప్పనికని నృపుఁడు
గొబ్బున నారిఁ దోడ్కొని సభకేఁగి, ప్రబ్బెడుకినుకతోఁ బ్రాజ్ఞుల నెల్లఁ
బిలిపించి బలిమిమై పినతల్లిఁ గవయు, ఖలుని నేక్రియ శాస్తి గావింపవలయుఁ
దెలియఁ బల్కుఁడటన్న ధీమంతులెల్లఁ, బలికిరిట్లని మహీపతి యిట్టిఖలునఁ
బట్టి నట్టడవిలోపల మొఱయిడఁగఁ, గట్టి చేతులుకాళ్లు ఖండింపవలయు
ననివిన్నవించిన నట్లెకావింపుఁ, డని యారెకులఁబిల్చి యానతియొసఁగి
భూమివల్లభుఁ డంతిపురము సొత్తెంచి, వేమఱు దొసఁగుల వ్రేఁగుచునుండె.
ఆయెడ ద్రోహురాలైన చిత్రాంగిఁ, బాయక కన్గొన్నపాపంబు దొలఁగ
స్నానంబొనర్పఁ గ్రన్నన నేఁగెననఁగఁ, బూర్వపశ్చిమమహాంబుధిఁ గ్రుంగె నినుఁడు
తగవుమాలి కుమారు దండింపఁగోరె, జగతీశుఁ డిదెయెంతసాహసంబనుచుఁ
గనవచ్చు ఖేచరాంగనల మేచాయ, లన సంజకెంజాయ లలరారె మింట
కామాంధుఁడై కన్నుఁగానక భోగ, కామినికై పుత్రు ఖండింపఁదలఁచె
జననాథు నపకీర్తి జగములనిండె, ననఁ జీఁకటులు పర్వె నఖిలదిక్కులను
చెలిని గట్టిగ బాసచేయించి నిజము, తెలియకఁ గొమరు బాధింపరాదనుచు
ననిమిషుల్ మిను పెచ్చునందిష్ట నిప్పు, తు నెలన రిక్కలు దోఁచె నభమున
తన పేరివాఁడును దనవంశకరుఁడుఁ, దనుబోలు భువనసుందరుఁడును నైన
సారంగధరుని ద్రుంచఁదలంచె దోస, కారియై నృపుఁడని ఘనతరక్రోధ

రసపూరితాస్యకై రవఁదోచెననఁగ, సొంపుగఁ దూపుచెసఁ బోఁడమెఱుంగుఁ జిందు
కూరితఁ జిత్రాంగి కొడుకుఁ జంపింపఁ గోరెఁబో దనచేతు గోరంతయైన
గన నేరననుచు నగ్గలముగఁ జేరు, కొని నభోవాణి పక్కున నవ్వెననఁగ
జిడిపిచానలకెల్లఁ జేటొనఁగూర్చి, గడితమై జగమెల్లఁ గప్పె వెన్నెలలు
తనమాట చెల్లెనిత్తఱినని యుబ్బి, కనుఁగొని చిత్రాంగికన్నులఁ బోలి
కలువలు దొగలు చెంగలువలు నల్ల, గలువలు వికసించెఁ గమలాకరముల
రూఢిమై దోషాకరుం డగురాజుఁ, జూడరాదని వీఁగుచొప్పునఁ బద్మ
నీసతి వదనమెత్తె మోడ్చుకొనియె, వేసరి చక్రముల్ వెతల బిట్టుడలె
నపుడ రేకులు మహోగ్రాకృతుల్ నిగుడ, విపరీతగతి బయల్వెడలి వాటింపు
నడునెత్తిసికలు గీర్ నామముల్ నలుపు, ముడివదులె డెందకాయ్మలున మొద్దు
కురుచదుడ్డులు రాగికోరమీసములు, గొరకయీటెలు గండ్రగొడ్డండ్లు వంక
కత్తులు మొలనీలికాసెలు పేప, బెత్తులు నరెలు ముప్పిరితాళ్లు నల్ల
గొంగడులునుగల్గి గొర...బఱచి, పొంగుచు నరనాథపుత్రుతో నగరు
జొచ్చిన వారలఁ జూచి యక్కొమరుఁ, డచ్చెరువాటూని హాయని సోలి
నిప్పుతొక్కినరీతి నిగ్గపైఁబడ్డ, చొప్పున వెతలనూర్పుచుఁ దనలోన
కటకట చలపట్టి కట్టడియగుచుఁ, గుటిలతఁ దల్లియిగ్గొడవఁ జేర్చుటకు
తండ్రియు నిగ్గతైనదయలేక యిట్టి, వేండ్రపుఁ బనికెట్లు వీఁగకనిలిచె
తగుమంత్రులును నీకుఁదగ దిదియనక, పగవారివలెఁ జూడ బాల్యశిరహాహా
ధర్మమించుకయైన ధరణిపై లేక, నిర్మూలమగుట గాన్పించె నల్లైన
మోసంబుఁ జెందక ముందుముందుగను. హాసి యొచ్చటికైనఁ బరతెంచుచుడిఁగి
ప్రాణంబుగలిగిన బలుసాకులైన, షోణి నేరుకతిని భువినుండనచ్చు
నను వెఱింగియు నే డహహా చేఁజిక్కి, బోనుపుదూలెడు పిట్టపోలిక నుంటి
పూనినకర్మంబు పొదివి యెందైన, బోనిచ్చునే వెట్టిపోకలు గాక
కర్మంబు దిగిప్పినకిరణి దిమ్మగకఁ, జేర్మితో విధికైన బ్రిదెలిపోఁజను నె
పరికింప నాకీక పార్వతీవిభుఁడె, దరిగాక యన్య్యలెంతటివార లనుచు
దిటముఁగైకొనియున్న దివిరియక్కొమరు, నటచూచి తలవరు లడలుచు డాసి
వతిచేసి రాజునానతి యెఱింగించి, యతనిరత్నోర్మిక యానవాల్ చూపి
సిగపట్టి పెడమర్లచేతులు దిగిచి, బిగఁగట్టి లేజింకపిల్లను బోదలి
కొని పారుతెంచు కుర్కురములకరణిఁ, గొనిపోయి పురిచెంతఁ గూర్చుండఁబెట్టి
వడురేయి పనిలోన నఱకుదమనుచు, గడంకతో వలగొని కాముక యుండి

ఈవార్త చెవులనాలించి దద్ద, నెవ్వడి మూర్ఛమునింగి రత్నాంగి
మెల్లన తెలివొంది మిడుకుచు లేచి, తల్లడంబున గుండె దడదడలాడ
పెదవులుదడుపుచు పెంపెల్లఁ దూలి, వదనారవిందంబు వన్నియదఱుఁగఁ
జాలి డెందములోనఁ జాలపెంపొంద, వాలుఁగన్నులనీరు వరదలై పాఱ
నడుగులు దడఁబడ హారముల్ వీడ, తొడవులుఁబడల పెందురుము జీరాడ
గడగడ నసమలేఁగొను వడంక, నుడుఁగక బడిబడి నూర్పులునిగుడ
హాకుమార మనోభవాంచితాకార, నీకిట్టి నేడ్పాటు నేడు వాటిలెనె
యనుచు నత్యంతశోకాక్రాంత యగుచు, జననాథుపాలికిఁ జని యిట్టులనియె.
ధరణీశ నేడు నాతనయరత్నమును, నిరుపమసౌందర్యనిధిఁ జగనేల
మేలాలుపచరించు మేలాలు మదిని, గీలించుకొని చేడుగీ లించుకైన
నరయనేఱక చిక్కు యక్కట పెక్కు, వెరవులవును గొడ్డువీఁగికన్నట్టి
కొమరుని సురపుణ్యగుణపయోనిధిని, విమలాత్ము నురుముగావింపఁ బూనుదురె
పుడమిలో మునుదొరలీ భోగకామినుల, నిడుకొన్నవారు లేరే వారలెందుఁ
దొడవులుఁ జీరెలుఁ దొడుకులు నూళ్లు, విడిముడియును గంధవీటికాదులును
కడునొసంగిరి గాక కట్టుములగుచుఁ, గొడుకులఁ బోకార్చుకొనిరె యీరీతి
పురహరువరమునఁ బుట్టినవాఁడు, పరసతీవిముఖుఁడై పరగెడువాఁడు
చెల్లఁబో యితఁడెట్లు చెనఁటియై సవతి, తల్లితోఁ బెనఁగొనఁదలఁచె డెందమున
పినతల్లులింద్లకుఁ బృథివీశుండైనఁ, జనువున గొడుకులు చనుటనేరంబె
చూపోపఁజాల కిజ్జూటుకత్తియరొ, పాపనిపై నట్టిపాపంబుఁ గట్టె
కామాంధుఁడవుగాన కానక నీవు, ప్రేమవీఁడెదు కన్నబిడ్డనిమీఁగ
క్షితిలోనఁ జేతనాచేతనజ్ఞాన, మతికామకుల కొందు నాత్మలోఁగలదె
తరుణిపెట్టినమందు తలకెక్కి యుందు, నిరవుగా నీయొడలెఱుఁగవు నీవు
పొలఁతిమాటకుఁ బుత్రుఁ బొలయించెదేని, పలుతెఱంగుల శపింపరె నిన్ను జనులు
నిందయుఁ బాపంబు నిజకులాత్యయముఁ, జెందదేటికి సాహసించి యిబ్భంగి
సకలదిగంతరాజద్రాజసంస, దకలంకలీలానిరంతరోల్లసిత
సితకీర్తిచంద్రికాంచితుఁడవై వినఁగ, గతినొప్పు నీవివేకం బెందువోయె
వనిత లేఁబజవేలు వత్తురు గాని, తనయుఁడు గల్గుటెంతయు దుర్లభంబు
వలువదిప్పని మహీవర నాదుమనవి, తలఁపుననిడి వేగ తనయుని మనుపు
కావున్న నొకకొంత కాపుచేయించి, కాఁక ముమ్మ్రనుప్రోలుఁగడపి పుత్తెంచు
కొడుకును నేనును కోడలుఁగూడి, పుడమి నెచ్చటనైనఁ బోయియుండెదము

చాలించుపంతంబు సైరించుతప్పు, చాలు మాకీభూమిసామ్రాజ్యపదవి
యనివేడుకొనిన రత్నాంగిఁ దలంచి, మనుజేశుఁ డేమియు మాటాడకుండె.
అటులున్నఁ జూచి రత్నాంగి డెందమునఁ, గటకటంబడి యహో కార్యంబుదప్పె
దిటముగా పిడుగు మొత్తినరీతి నితఁడు, కటికెతనంబూని కదలకున్నాడు
దరియెవ్వరింక నిత్తరి నిదిమాన్ప, హరహర కఠినాత్ము లధిపతు లెన్న
తనయునినైన సోదరునైన బంధు, జనునైన దనుగన్న జనకునినైన
మానక రాజ్యాభిమానంబుఁ బూని, మానవేశాధముల్ మడియింపుచుండ్రు
భువిలోన రాజ్యాంతమున నఱకంబు, ధ్రువమని స్మృతులు పొందుగఁ బల్కఁగాదె
కాపట్య మధికంబు కనికరంబిల్లె, కోప మెక్కువ శాంతగుణమ్ము కొఱంత
చాంచల్యమురవు హింసాబుద్ధిఘనము, వంచకత్వము పెల్లు వర్తనల్ సున్న
చలముదట్టము సత్యశౌచముల్ కల్ల, నిలుకడనాస్తి దుర్నీతిగాటంబు
పరధనాపేక్ష నిబ్బరము ఛీ యిట్టి, ధరణీశ్వరుల కేటి ధర్మమార్గములు
కొడుకు నెట్లును బ్రోచుకొనుటకై యెగ్గు, పడక చిత్రాంగినె ప్రార్థింపుమటొప్పు
కార్యార్థికకుతో గర్వమటంచు, నార్యులు దఱుచుగా నందురుగాదె
యనుచు సయ్యన నగ్గయాళిపాలిటికిఁ, జని వినయంబు మించఁగ నోలిఁ బలికె
సఖియరో చిత్రాంగి సారంగధరుఁడు, పరికటింప నీముద్దుపట్టియు కాదె
పాపనిపై యింతపంతంబుఁ బట్టి, కోపించి దండింపఁ గూడునె నీకు
తనయు లొక్కొక్కవేళ తప్పుచేసినను, కినిసి తల్లులువారిఁ గెడపఁబూనుదురె
పినతల్లి వేదనో పినతల్లివనుచుఁ, జనవున నతఁడు నీసమ్ముఖమ్మునకు
బొడఁగనవచ్చిన బూమెలుపన్ని, కడురిత్తదోసఁగులు గట్టనాయంబె
తలఁపంగ నొకమహీధవు చెట్టఁబట్టి, నెలఁత నీవొకటియు నేనొక్కటియునె
సవతిబిడ్డనుబట్టి చంపించెననుచు, భువనంబులో నిందబొందుట మేలె
హంసగామిని లెస్స యాత్మఁజింతించు, హింసకన్నను బాప మెందునుగల్ల
దీరసం బెదలోననిడక యివ్వేళ, గారాపుకొమరునిఁ గాచిరక్షించు
మనివేడుకొన నది యాకులతాడి, యనువున మ్రోఁగుచు నాపె కిట్లనియె.
సరిసరి యోబళా చాలుచాల్ మేలు, దొరసానివని నీటువొరలఁ బల్కెదవు
రాచబిడ్డఁడనుచు రమణి నీతనయుఁ, డెంచి తా మగనాళ్ల యిండ్లెల్లదూరి
క్రొవ్వున బలిమిఁ గైకొని సిగ్గుగొన్న, నవ్వుచు గొదికి మిన్నకయుండవలెనె
కొమరుండు దెరువాట్లు గొట్టుచున్న, దమితోడ జనకుండు తగవులుచెప్పు
నన్నట్లు తనయుని యాగడాల్ గ్రమ్మ, తిన్నఁగా చక్కట్లు దిద్దఁ జూచెదవు

చెల్లంబో కటకట శివుఁడును నేఁడు, కల్లరియై నిన్ను గావలేడయ్యొ
బాపురే దైవంబు పాపకర్మలకు, దాపగు ననుమాట తథ్యమైతోఁచె
సత్యంబుపడదయ్యె సమసెధర్మంబు, నిత్యమయ్యెనుకల్ల సలిచెపాపంబు
దైవంబుగురిదప్పె తప్పెకర్జంబు, భూవల్లభునిబుద్ధి పూరిమెసంగె
మునునోమినట్టి నోములబలం బిట్టు, లనుభవింపఁగనయ్యె నయ్యయో దీని
కేమిసేయుదు నింక నెవ్వరికనందు, నేమిఁట యివ్వేత యెడఁబాపుకొందు
కొడుకు నాకంటెనెక్కుడుగఁ జిత్రాంగి, కడమాతృభావంబుగా నెన్నుకొనక
దుడుకుచేసితివి తుందుడుకయ్యె నీతి, యెడలని నీబుద్ధి యెక్కడబోయె
పరధన పరవధూ పరమనస్కులకు, పరికింప నిహమును బరమును గలదె
యని విలపించుచు యవనిపైఁ బొరలు, కొనుచు పెంధూళిబ్రుంగుచు దూపగొనుచు
సొమ్మవోవుచుఁ దేరిచూచుచు లేచి, యుమ్మలింపుచు వెచ్చనూర్చుచునున్న
జనని నూరార్చుచు సారంగధరుఁడు, వినయంబుదైవార వెస నిట్టులనియె.
అమ్మరో చిత్రాంగినరయక పత్రిత్య, హమ్మ నీమారుగా నాత్మలోఁదలఁతు
నయ్యమననుఁ జూచి యతిమనోజార్తి, నయ్యమ్మయనుచు డాయఁగరాఁగ బెనఁగి
కాదనివచ్చిన గాకచే నులికి, మేదినీశ్వరున కేమియొ విన్నవింప
నోజమాలిన రాజయో తునిమింపఁ, గాఁజూచి పెద్దలు గాదనరైరి
యింతియకాని మ ఈమియూ నెఱుఁగ, నంతకంతకుఁడె తథ్యంబొప్ప నెఱుఁగు
నిలఁ బురాకృతకర్మ మిటువలెఁ గుడువ, వలసెఁబో దీనికి వగవనేమిటికి
పాయని సుతశోకపారవశ్యమున, నాయమ్మ నీవుండ నాయమ్మటంచు
నిలువాసి సభకురా నెట్లువోసంగు, వలువ దూరకపొమ్మ వంతనువీడు
నాయనుంగుల నెల్ల నాయట్ల చూడు, మేయెడ పతిభక్తి యెడలకయుండు
చిత్రాంగిపైఁ గిన్కసేయకు మిగుల, మైత్రివాటింపు మేమరకు ధర్మంబు
నృపతిఁ బోనాడకు నీతిపోవిడకు, మెపుడు నాకైకస్తి యెదలోన నిడకు
మనుచు కేల్గవమోడ్చి యడుగుల కొరగి, కనుదోయి నశ్రులు గ్రిమ్మఁబల్కుటయూ
హాయని ... ... పాయనివెతలఁ బొల్పడిలేచి కొడుకు
గ్రుచ్చి కవుంగిటఁగూర్చి దీవించి, వెచ్చనూర్చుచు బాష్పవిహ్వాల యగుచు
చెక్కులుముద్దాడి శిరము మూర్కొనుచు, నక్కుమారుఁ దలార్ల కప్పనజేసి
తొలఁగిపోవుచుఁ గాళ్లు తొట్రుపడంగ, నిలిచిచూచుచుఁ దూలి నేలవ్రాలుచును
క్రేపుం ... ... ..., భూపరియడలు ... యడంగి
యెట్టకేల కనూనయించి చేడియలు, పట్టియీడ్చుకపోవఁ బడఁతియల్ చేరి

# ద్వితీయాశ్వాసము.

కొడుకునైఖరు లెన్నుకొనుచు శోకాబ్ధి, నెడపక మునుఁగుచు నీదుచు నుండె
నగరరక్షకు లంత నడురేయియైన, దగకుమారుకు బంధముల వదల్చి
చెదరినకురులు వాసిగ సిగవైచి, కుదురుగా మొగలిరేకులు నిండదురిమి
నొసల కస్తురిబొట్టు నునుపారఁ బెట్టి, కొసరువెట్టక మేనఁ గుంకుమంబలఁది
యలరుసంపఁగిదండ యరుతఁగీలించి, పొలుపార తొడవులొప్పగ బొందుపఱచి
క్రొవ్వాడికత్తు లొక్కటత్రిప్పుకొనుచు, క్రొవ్వార నతనిఁదోడ్కొని యటుతరలి
వటపటీరరసాలవానీరసాల, పటకుటజాంకోలపనసతక్కోల.
తాలతూలతమాలతతకృతమాల, మాలతీకురవకామలకహింతాల
మాలూరపురపిచుమందమందార, గాలవారలకర్ణికారభండీర
నారికేళాశోకనాగపున్నాగ, నారగలుంగచందనకుందపూగ
జంబూకదంబకాశ్వత్థకపిత్థ, జంబీరపాటలిచంపకాచ్చోట
కరవీరకేతకీకదళీలవంగ, సరలకీచకముఖక్ష్మారుహాన్వితము
శరభసైరిభఖడ్గశల్యభల్లూక, కరిశశగంధర్వగండభేరుండ
రురుకురంగసృగాలగోతకవ్యాఘ్ర, హరిణగోలాంగూలహర్యక్షగవయ
సృమరశంబరకోకచీనగోకర్ణ, చమరగోహిషతరక్షుస్తబ్ధరోమ
రామభుజంగమార్జారాదినిఖిల, భీమవన్యమృగేంద్రబృందసంకులము
క్రికరధార్వాఘాటకంకధూమ్రాట, బకచకోరకకోకపరభృతోలూక
కాకగృధ్రమయూరకలరవకీర, కాకోలహారితగరుడకపోత
కుకుభభరద్వాజకుక్కుటసారంగ, కృకవాకుటిట్టిభకృజ్మరాశాది
వివిధగరుద్రిధవిసరవిచిత్ర, రవనిరంతరసమాక్రాంతంబు నగుచు
దగుమహారణ్యమధ్యముజొచ్చి యచట, జగిమించు నొకవధ్యశిలమీఁద నతని
నిలిపి మేతొడవులన్నియుదీసి యింక, దలఁపుము నీయిష్టదైవంబు నంచుఁ
బలికి ఖండింపనోపక కొంకుచున్న, తలవర్ల కాభూపతనయుండు పల్కె
వినుఁడన్నలార యివ్విధిఁ గొంకనేల, మనుజవల్లభుపంపు మఱలింపఁ దరమె
మీరునాకును నేనుమీకును దప్పి, నారముగాము...... దైనఁగాని
నళినగర్భుఁడు మున్ను నాలలాటమున, వలనుగా వ్రాసినవ్రాత యిట్లుండె
మీరేమిసేతు రిమ్మెయి దైవఘటన, యీరీతినగుట కింకేల చింతింప
తలంపుము యిష్టదైవంబునంచు, బలికితి రహహా యిప్పగిది జంపింప
తల్లిదండ్రులెపూని తమిఁబంపునపుడు, చెల్లంబొ వారలఁ జింతింపనేల
ధర్మంబు ... ... ..., ధర్మదేవత నింక దలఁపనేమిటికి

యెల్లవిధంబుల నియ్యెడ నాకు, తల్లియు దండ్రియు ధర్మదేవతయు
దైవంబు గురుఁడు బాంధవుఁడు మిత్రుండు, కావ బ్రోవంగ........
యని విహాయసకేశు నఖిలలోకేశు, వినిహతకీనాశు వృజినవినాశు
గౌరీమనోనాథు గంగాసనాథు, సారయశస్సాధు సాధితాసాధు
యతిమనోబ్జవిహారు నహిరాజహారు, వితతమహోదారు విబుధమందారు
.........వాసు నిత్యవిలాసు, కలితగుణావాసు కరిచర్మవాసు
విమలధర్మనికాము వినమితకాము, సమదశత్రువిరాము జగదభిరాము
సదమలశ్లాపు చంద్రికలాపు, విదళితభవతాపు విదితప్రతాపు
కరధృతసారంగు కరుణాంతరంగు, సరససద్గుణసంగు జలధినిషంగు
ఘను మహాదేవు శంకరు భక్తసులభు, దనమదిలోనిల్పి తలఁపుచునుండె
నపు డారెకులు కత్తు లనువొప్ప నూరి, కృపలేక.........
కరచరణంబులు ఖండించినైవ, హరహర పరమేశ యంచు నతండు
బిగిచెడి కీలుదప్పిన పైడిబొమ్మ, పగిది దబ్బున నేలఁబడి సొమ్మఁగొనియె
తలవరు లతనిచందంబెల్ల నిలిచి, తెలిసిపోవుదమంచుఁ దివిరి.........
.........జేరి పొంచియున్నంతఁ, బడపడి యారాచపట్టి వే తెలిసి
కనువిచ్చి నలుగడల్ గనుఁగొని భీతి, పెనఁగొన డెందంబు పెల్లవియంగ
నెత్తురువరదలు నెమ్మెయి గ్రమ్మ, ......తెలుంగు చొప్పడఁజేయ
నిల బొమ్మరిలఁబడి యేడ్చుచు నొడలి, సలుపున నడలుచు జడిగొను తొరుగు
కన్నీరు సోనల కాల్వలైపారల, మన్ననవ్రాలి వేమఱుఁ బొరల్కొనుచు
దైవంబుదూరుచు తల్లడింపుచును, జీవంబు లూడంగ శివశివా యనుచు
సొమ్మవోవుచు దేరిచూచుచు దూరె, యుమ్మలింపుచుఁ దద్ద యుసురుసురనుచు
హా తాత హా మాత హా జగన్నేత, యేతెఱంగుననోర్తు నీయార్తి ననుచుఁ
దలవరులార వంతలకోర్వఁజాల, తలయు గొబ్బునవచ్చి తరగరే యనుచు
గారుబెబ్బులులార కడలేనిఘాక, మీరఁ బైకొని వేగ మ్రింగరేయనుచు
బహుయాతనల గాసిబడఁజాల నింక, గహనానలము తూరి కాల్పవేయనుచు
చిత్రాంగి హాయెంత చేసితే యనుచు, ధాత్రీశు డెంతనిర్దయుఁడయ్యె ననుచు
తరులార గిరులార తాపసులార, కరులార హరులార గంధర్వులార
నరులార సురలార నాగేంద్రులార, కరుణమీరఁగ ననుఁగావరే యనుచు
పెగ్గడబిడ్డనిమాట భీరువోవిడుట, కగపడెంబో ఫలంబని యెన్నుకొనుచు
దుండగంబున నేతెఁ దొలుబాముసందు, ఖండించినాడనో గాక యాఘోర

దురవస్థ నేడు చెందునె దీనికింకఁ. బరులనాడఁగ నేమిపనియనుకొంచు
మశకపిప్పిలికామాక్షికాక్రిములు, పిశితేచ్ఛఁబొదవిన బిట్టుగాసిలుచు
మృగఖగనివహముల్ మెలఁగెడి చదులు, దగిలియాలించి యంతయుదిగుల్ గొనుచు
కరపదహీనుఁడై కడుబహుళార్తి, ధరగుందు సారంగధరుఁడును బోలె.
కరపదహీనుఁడై కడుబహుళార్తి, ధరగుందు సారంగధరున కవ్వేళ
ఘనతరవర్షాభ్రగర్జాగభీర, నినదయై యశరీరి నెమ్మి నిట్లనియె.
నృపపుత్రి యివ్విధ నేటికి వగవ, నిపుడు దొల్లిఁటిపాపమెల్ల భువితప్ప.
నేటికిదీరు తద్వృత్తాంతమెల్ల, తేటతెల్లంబుగఁ దెలిపెద వినుము
భువిని గోళాంబయన్ బురవరం బేలు, ధవళచంద్రుండను ధరణీతలేశుఁ
డనఘుఁ డాతనికి జయంత సుమంతు, లనెడు పుత్రద్వయ మలరొందుచుండు.
రందు సుమంతునం దఖిలభారంబుఁ, జెందించి పతి దయసేయుచున్నంత
నోర్వలేక జయంతుఁ డొకనాఁడు మిగుల, దుర్వృత్తి నలసుమంతునిఁ జంపఁదలఁచి
భువనసుందరియను భూపతిభోగ, కువలయేక్షణ దాసిఁగూర్చి సుమంతు
పావలాభోగింప పట్టెమంచంబు, క్రొవబెట్టించిన నృపతి యాలేమ
యింటికిఁజని పానుపెక్కి మోహంబు, దంటమాటలఁ గొంతతడవు గ్రీడించి
యొరగి తమ్ములమిత్రునుమియంగఁ బోయి, దరినున్న పావలు తటుకునఁ జూచి
యరుదంది యివియేరివని యడుగుటయును, దరుణియంతయు భీతిఁ దలిరుంబుడిగ్గి
నిలుచుండి యడుగుల నేలవ్రాయుచును, దలవంచుకొనియున్న ధరణిపుఁ డపుడె
కొలువున కరుదెంచి గొబ్బున పాదు, ... ... ... యంగనచటి
నెఱవాదులనుజూచి నెరవుఁగా మీఱ, లెతీఁగింపుఁ డీపావ లెవ్వారివనిన
తలలుపంచుకొని యందఱు నూఱకొన్నఁ, దలవరియొకఁడు మంతనమున నత్తె
ఱంగెల్లఁదెలిపిన రవరవల్ నిగుడ, చెంగటి బుధులనీక్షించి యవ్విధము
దెలియఁజెప్పి విభుండు దీనికేశాస్త్రి, గలదన్న వారలు కడఁకతో నట్టి
ఖలుని నట్టడవిలోఁ గాళ్లుఁజేతులును, జెలరింపదగునంచుఁ జెప్పిన నటులె
చేయింపఁబనిచి యాచెలువను నూతఁ, ద్రోయించెనట సుమంతుని దలవరులు
కరచరణంబులు ఖండించినైన, నిరపరాధిని నన్ను నిర్దయ నిట్లు
దునిమింపఁజేసిన తులువ......., తునిమింపఁబడుగాక దొసఁగుల నడలి
యనుచు శాపంబీయ యతితరవ్యథల, మునిఁగి యాతఁడు ప్రాణముల వీడుకొనియె.
అలజయంతుఁడవు నీ వాసుమంతుండుఁ, దలఁప రాజమహేంద్ర ధరణిపల్లభుఁడు
కావున దొంటిదుష్కృతులను మీవిప్ప, డీవిధంబున భుజియించితి వింకఁ

జెచ్చెర నీకును సిద్ధపదంబు, విచ్చలవిడి నబ్బ వెఱవకు మనుచుఁ
దెలిపి యప్పుడు ధర్మదేవత చనినఁ, దలఁపున నారాజతనయుఁ డొక్కింత
దిటమూనియుండె నత్తెఱఁగెల్ల రాజ, భటులాలకించి లోపలుమరు వగచి
కటకట నృపుఁ డింతకట్టడి యగుచు, మఱుమాయలాడియు మాటనుపట్టి
కల్లనిజంబులు కనుఁగొనలేక, బల్లిదుండగు కన్నపట్టిఁ ద్రుంపించె
భూమిలో రాజ్యవిభూతిమంతులకుఁ, గామాంధులకు వివేకం బెందుఁగలదె
యనియనుకొనుచు గ్రిచ్చరమహావన, మునకేఁగి యొకయీరమున నుండి రంత
వనభూమి నటువలెవనరు భూరమణ, తనయుని యార్తనాదం బాలకించి
దరినొక్క గిరిగుహాంతరమున యోగ, సరణిగ్రీడించు నిశ్చలతపోధనుఁడు
మీననాథుండను మేటిసిద్ధుండు, మానితకారుణ్యమానసుం డగుచు
నిప్పు డీనడురేయి నెవ్వండో త్రోవఁ, దప్పిన ట్టడవిలోఁ దలకొనియేడ్చు
చున్నవాఁ డత్తెఱం గొయ్యన తెలిసి, క్రిన్నన వత్తునుగాకని తలఁచి
వనిచి కెంజిగిసోగ............., దినుసుమీఱఁగఁ దద్ద డిందుగాఁజుట్టి
నింగినాదపుకొమ్ము...లాంతంబు, కెంగేల దొరపులు గిరిగొ......
పలువన్నియల యోగపట్టంబు దాల్చి, మొలను బెబ్బులితోలు మురువుఁగాఁగట్టి
మేలిక్రొందెలిబూది మేననలంది, లీల రుద్రాక్షమాలిక లెదనించి
పాడులయొడ్డాణంబు పొసఁగబిగించి, గడితంపు వెలిపట్టుకంథ పైఁగప్పి
వెడఁదలై కనుపట్టు వీనుల మించి, కడిఁదిజాబిలిరాలకామాక్షులునిచి
చెలువంపుకకపాల చేతధరించి, గిలుకుపావ ... ... ...
యరుదెంచి రక్తసిక్తాంగుఁడై నేల, శిరమూనుకొని బిట్టుచెట్టల నలిఁగి
తునిగిన కాళ్లు చేతులుగల రాజ, తనయుని వీక్షించి తద్దయు వగచి
చెల్లరే తొగలనెచ్చెలికాని మేన, ... ... గమున వీరు
నతిసుకుమారు నిట్లనుకంప లేక, వెతఁబెట్టి రెవరో యివ్విధపాతకమున
కొడిఁగట్టుకొని యంచు నొయ్యన వాని, కడకు దగ్గఱఁబోయి కరుణతోఁ బలికె
న ... ... ..., గహనోర్వి...దుఃఖములఁ గుందెదవు
నీకిట్టిదుర్దశ నేడేల కలిగె, ప్రాకటంబుగ వేఱుపఱుపు మటన్న
తలయెత్తి వాల్గనుతామరల్ విచ్చి, నలుదిక్కులుం జూచి నరనాథసుతుఁడు
తనమ్రోలఁ గనుపట్టు తాపసప్రవరు, ఘనతేజుఁ జంద్రశేఖరనిభమూర్తిఁ
బెన్నిధానముఁగన్న పేదయువోలె, కన్నులపండువుగాఁ బొడఁగనియె.
అయ్యా నీవెవ్వ రిట్లనుకంపమెరయ, నెయ్యంబుతో మ్రోలనిలిచి వీనులకు

చిల్లని నవసుధాసారంబు చిలుకు, మెల్లనిమాటల మేలౌకుమార
నూరార్పఁబూనితి......నఁబ్రోవ, .........చాపుడవో
సిద్ధంబుగా భూప్రసిద్ధుండ వైన, సిద్ధుఁడవో నాకుఁజెప్పుము తండ్రి
నినుఁజూచినపుడె పూనినచెట్లెల్లఁ, బోను ... ...
పుడమి ... ... ..., కడలేని యిటువంటికష్టి రాఁద గునె
నరలోకమందార నాతెఱంగెల్లఁ, బరికించి వినుడగ ... ...
ననఘాత్మ రాజరాజను రాజవరుని, తనయుఁడ సారంగధరుఁడనువాఁడ
పినతల్లియింటికి ప్రేమతోఁ జనిన, వనిత కామార్తయైవచ్చి తన్గదియు
మనుచు దగ్గన గాదనుచుఁ గప్పించు, కొనివచ్చుటయు నింతి కొఱకొఱతో డ
తనతప్పు నామీఁద దవిలించి చెప్పి, కినుకపుట్టించిన గెరలి పిసాళి
నన్ను తేఁ డిటులోజమాలి కోయింప, ... ... ...
కరములరవములు కరము సంతాప, కరములై తీపెత్తి కాఱియంబెనుప
నతితరవ్య ... ... నిలువ, ధృతిచాలదింక నుద్దీప్తకారుణ్యా
వీక్షణంబె ... ... ... యోగి రాజరాజేంద్ర
కాకున్న ... కాయనష్టముగఁ, జేకొని యొకమందు చెప్పవే యనుచు
తనమొండిచేతులు దలమీఁదఁజేర్చు, కొని నమస్కృతు లొసంగుటయు...
నాఘను ... ... ... ... ...
హాగురుదేవ... ... ..., భోగి కియ్యాపదల్ బొదవునేయంచుఁ
గటకటనొంది దగ్గరి మేను నిమిరి, పటుమతి నారాచపట్టి నీక్షించి
వత్సనిమదినింక ... వత్సలుచార్వ ...
చావెందు కోటీరు పణిరాజహారు, కైలాసనిలయు శంకరు మహాదేవు
సకలలోకారాధ్యు శరణంబు నొంది, య ... ...
చేకుఱుఁ దొల్లి చేసినపాతకంబుఁ, జేకొని మెసవక చెల్ల దెవ్వరికి
నని యూరడిలఁబల్కి యాతని నెత్తు, కొని చని కల్పా ...
పరిమళమిళిత ... ..., పరిపాణసంభ్రమభ్రమరిదభ్రమర
విభ్రమభ్రమరికావిసరనిరంత, రభ్రాజమానవిరావసంకులము
జలజనాళాహ ... ..., కలనా ... ...
మధురస్వరోజ్జృంభమాణ నినాద, బధిరీకృతాఖిలప్రాణిజాలకము
ప్రియవియోగోద్భవాఖిలదురంత, భయశోకు ... ...
మా ... ... ..., దీనవచోవృత్తదిక్తటంతరము

కేళీసమాసక్తి కిన్నర త్రిదశ, బాలాకుచాలిప్త భద్ర
...ర్దమాంకిత దేవ్యగంధస ..., నిర్దోషవినిర్మలనీరపూరితము
మకరకచ్ఛపశింశుమారకుళీర, శకులనక్రగ్రాహశాలూరముఖ్య
యాదఃకదంబవిహారసంఘట్ట, నోదితసాంద్రతరోర్మి ...
మందగంధానిలమాలికోద్ధూత, సందీప్తశీకరాసారపరిసార
జాతితపరిషేచితాత్యంతమృదుల, శీతలసముపేతసికతాతలంబు
...నొక్కకొలను డాయఁగ జేరి యందు, దగవాని మేని రక్తంబెల్లఁ గడగి
నీరార్చి కడుపార నీరుద్రావించి, కూరిమిఁ దానుండుగుహలోను జేర్చి
... ... ..., యున్న పాలాకలియుడుగఁద్రావించి
కరపదసంసిద్ధిఁ గావించుకొఱకు, సారదిపై మదిదలంచుచునుండె నంత
... ... ..., రిక్కలు గనుమాసె రేయెండవాసె
తూరుపు ... తొగఱేఁడుజారె, జారులు వడిబారె జలజము...
శోగ ... ... ..., మొగిఁ దేట్లు కొలఁకులమ్రోగె నత్తరిన
ముగురువేల్పులయిక్క మ్రొక్కులఱేఁడు, పగలింటిదొర శతబాబాలజోదు
జగముల... ... ..., మగువమేల్ తొగలేమమున్నన బాధ
మిన్నుమానికము ప్రామినుకులపెట్టె, వెన్నునివలకన్ను వేడివెలుంగు
పుడమివేల్పులనిచ్చ పూజలమెచ్చు పొడపుగుబ్బలిమీఁద పొడచూపెనంత

... ... ... ...

... ... నటుమటునగుచుఁ గొల్లైయున్న భూమి
తలవరు బొడగాంచి తలవరుల్ దండ, ములుబెట్టి తొడవులు ముందఱఁబెట్టి
యాకాశ ... ... ...
... ... కొడుకుబోకడ బెట్టుకొంటివటంచు
మిడికిన నతఁడు పబ్బినయార్తితోడ, పుడమి దిగ్గనవ్రాలి పొగ ...

... ... ... ...

పెగ్గడలఁ జుట్టల పెద్దల బుధులఁ, దగువారిఁ గొనుచు నంతఃపురి కరిగి
యలుకతో బెదరించి యా... ... ...
గ్రిన్నన చిత్రాంగి రావించి యోసి, చెనఁటికాన నీచెడుజాడ లుడిగి
కలచంద మెల్ల నిక్కంబుగ ... ... ...
వలన నంతయుఁ దలవరు లాలకించి, తెలిపిరిప్పుడు మాకు తేటతెల్లమిగ
నకట పాతకురాల యాత్మనీ ... ... ...

పరికింపనేరక పలువన్నె వంశ, కరుఁడగు కొడుకుఁ బోకడఁబెట్టుకొంటి
నంచు బిట్టువలించియాడిన బిగువు,... ... ...

... ... రవ్వలమారి యారాజున కనియె,
ఓనెత్తురాజ నీయొరపుఁబట్టాపు, దేవిమాయ యొకింత తెలియంగ...

... ... యలుకతోఁ బెద్దలనందఱఁ గూరి)
ననుదూబఁజేయ డెందమున దలంచి, పనిపూని యదలించిపలికెద నహహా
వినువినుమద్దేవివిరసం...

... ... చనవున...
కులగూడకట్టి టక్కులుపన్ని యిట్టు, పరికించెగాక యేపట్టున నిట్టి

... ... డబ్బిన నిటువలె డబ్బంగవలయు
నడవిలోఁ దలవరులందఱు వినఁగ, నడలొంద వాకుఱిచ్చె నట యశరీరి
యక్కడబల్కిన నయ్యభ్రివాణి, ...

ననిపూని పల్కెచో నాకాశవాణి
జనులాలకించి యాశ్చర్యంబు నొందఁ, బలికె నిట్లని మహీపాల యిక్కాశ
తలఁపున నిన్న , వలనుగా నతఁడు పార్వములకై యిగ్గ
యాళిలోనగరు పిన్నమ్మ యటంచు, జాలనమ్మికతో

, రమణమనోజ ఘోరవ్యథఁ జిక్కి
బలిమిఁగైకొనిన నొప్పక యాతఁడిట్టి, కొల నాకు దవిలింప...

... ... ...

తనతప్పు వానిపై దవిలించి వాడి, కొనగోళ్ల తన గబ్బిగుబ్బలువ్రిచ్చు
కొని నీకుఁజెప్పిన గాదుగకపట్టి,
బలికి మిన్నకయున్న పార్థివేశ్వరుఁడు, తలకొనియేడ్చుచు ధరణిమూర్ఛిల్లి
తెలివొంది కన్నులుదెఱచి కట్టెదుట,
చేయివేడి నిలుచున్న చిత్రాంగినలుక, దయివారనీక్షించి తరమి యిట్లనెను.
ఓసిపాతకురాల మోడక యిట్లు,

యామునను పొంగి యకట సద్ధర్మ
పరుఁడైన కొమరుని బాములఁబెట్టి, కరచరణంబులు ఖండింపఁజేసి
కులదీపకుండైన కొమరుని మరుని, గెలుచురూపసిని మిగిలినిలిక నిన్ను
జూడనొల్లనటంచు నుగ్రిక్కకపాని,

... ... ...

ముద్దులకొడుకును నిద్దంపురాణి, నిద్దతిం బాసి తేఁ డింకేమి జెప్ప
గొదలేనివంతలఁ గుందుచు సొమ్మ,

బలవరింపుచు విధిం బదరిదూరుచును

బెదరిపలుకుచు డస్సి పెంపెల్లఁ దూలి,

వినయవిద్యాతంత్రి వెరవొప్పఁబలికె

ధరణీశ యీరీతి ధైర్యంబు వదలి,
గడచినపని కింతగాసిఁ బొందుచును, గొడవలనూరకె కుంద నేమిటికి
యింతికై సుతు వధియింపరాదనుచు, యెంతచెప్పినగాని యెఱుఁగ

చెయ్యంగ గలవని చెప్పమా తెలియ

పురహరువరమున బొడమినవాఁడు, సరసగుణాఢ్యుఁడా సారంగధరుఁడు

మహిలోన నీవంటిమంత్రులు గలరె

నీబుద్ధిమును విననేరక చేల, నైబన్నమొందితి నపకీర్తిఁ బడితి
వసుధపై నతఁడు నీవాక్యపద్ధతుల,
మసలకకొని తెచ్చి మందుమంత్రముల, వెస బాగుచేయించి విశ్వవిశ్వంభ
రాతలంబునకెల్ల రాయనిగాఁగ,
నని పురోహితబాంధవామాత్యభృత్య,

దగిలియే తెంచె నాత్మజుఁ డున్నవనికి

యేతెంచి రుధిరసమీపమై భూత,

చాయక తునియలై పడియున్న కరప
దములు వీక్షించి నందనుఁడు లేకున్న, నమితశోకాకులస్వాంతుఁడై వేల

గొడవలనడలుచు కొడుకుబల్ నొప్పి

నెందుదూరెను చూడరేయంచు లేచి, క్రిందుగా వనమెల్లఁ గలయదిమ్మరు
వంతల పొంతల వల్లినికేత,
సందుల గొందుల జనుచుమహీజ, బృందంబుమాటున నెనసిరోయుచును
కరులార యక్షకిన్నరులార రత్న, ధరులార బిల్ల

శాకరులార పుష్ప, తరులార తోడుమెకములార చెంచ
తలులార పాపతోయ్యలులార మాని, కులులార మాద్య

కానరే మా పుత్రు కమనీయగాత్రు

దీనజనాధీను దివిజోపమాను

గనరె మాసుకుమారు ఘనసుకుమారు. కనదమలాకార కమలాకుమారు

నని విలపించుచు ననురనుకనుచు
గందమా రమ్మ మాకందమా యింత
జాలమా గంధ మార్జాలమా నీకు
బదమా కుమారు షట్పదమా యటంచు,
నెడపక తనువున నేరులై పారల
వనరుహారుచిరాస్య వనరుహా యనుచు, దనకు హా యిఁక నెద్ది తనకు హా యనుచు
బెదరుఁ గన్నులు మూయు పెదవులు
దలయూచు బెగ్గిలి దైనంబుదూరు, బలుమారు నఱచేయి ఫాలంబు జేర్చు
హా రాజకులదీప యలఘుప్రతాప, ధీరసల్లాప భువనాతీత
జాతరూపాంబర జాతరూప
నయ్యయో చిత్రాంగియను పెనుసతి, కీయ్యెడ నిను బలియిడితిఁబో తండ్రి
యని మది నింతింతయనరాని వంత,
ధరణిపైఁ బొరలాడు తనముద్దుకొడుకు
కరపదఖండముల్ కరము వేదనల, శిరమున నక్కున జేరుమకొనుచు
నుడియించుదాక నెమ్మది నూరకుండి
కొదిగి తా మిన్నకయుండిన నేమి,
తపియాక నిను మున్ను దరిగించి రాజు,
మఱియు నత్తరి రాజు మానని వెతల, నుకియతనంబేపి మొరలుచునుండి

కన్నులు చల్లఁగాఁ గనుఁగొనలేక, పన్నగా నడవులపాలు గావించి
గడలేని శోకాబ్ధి గడచుట యెట్లు
హాళిమై నిన్ను గయ్యాళియైనట్టి,
సయ్యాన నెందైనఁ జనుమని ప్రోలు
వెలులగొట్టింపక వేఱేఁడి నగుచు,
నీవు లేకున్న యీనిఖిలరాజ్యంబు, జీవనంబును రాచబిన్నె లేమిటికి
నని దుఃఖమెడలింప నలవిగాకున్న,
బలుబోతుమడువున బడఁబోవు మనసు
నోహో మహీనాథ యోరిమి లేక

డేకొదవయు లేక యెలమి మత్స్యేంద్రు,

గరపదసిద్ధియుఁ గాయసిద్ధియును, దొరకించుకొని యాసురుం డింత
నగరిపు నిభుఁడనై నగరిపాలించు

అట మీననాథమహాసిద్ధవరుఁడు, పటుమతి నలరాచపట్టిఁ జేపట్టి
పాలించి యొకమంచెపైనుంచి
. హాళినొందుచునుండి యంతట నతని
కరుఁడైన తనసముద్యత్ప్రభావము
సమపేతుఁగావించి సదమలహృదయు,
మఱియుఁ బెక్కగు మణిమంత్రౌషధంబు
కూరిమినరయుచు కొన్నివాసరము

గనుఁగొని వత్స నిస్గాంచినవారి,
మనుజేంద్రుఁ డమ్మహామహునకు నెదుర
సంతోషబాష్పముల్ జలజలదొరుగ
నక్కునఁజేర్చి మేనంతయు నిమిరి,
నక్కట తనయని న్నరమర దలఁచి, టక్కరినై యుక్కడంపఁ జేయుటకు
నాపుణ్యమున మీననా , ప్రాపయి నిన్ను జేపట్టి రక్షించె
నాతప్పులెన్నక నాముద్దుకుఱ్ఱ, నీతల్లికై యిఁదునిలిచి నన్మనుపు
తనయునిగని నేలఁ దడయక వ్రాలి
గుప్పన దెలివొంది కొమరునిఁ బొదవి, చుప్పిరిగొను మోహమున బొక్కుచున్న
డనుఁగుబిడ్డనికి నెయ్యమున నిట్లనియె
తనయుఁడ నిన్ను వీతనయుఁడ నగుచు, దునిమించినట్టి మత్తుని నన్ను మిగుల
నినుఁబాసి వర్తింపనేర నీవెంబ
డితెపత్తునంచు నంటిన ప్రేమ వేడు, కొనుచున్న జనకుఁ గన్గొని
ధీరమని ఖలులు వర్తింతురుగాక

నాకె బుద్బుదములవంటి దేహంబు,
ప్రాణి కర్మానురూపంబున నఖిల, యోనులఁ బ్రభవింపుచుండునదం
సానెకు మునింగి వేసారుచు నరక
యాతనత్రయముల నెడపక తగిలి, భీషణాంతశ్శత్రుబృందంబుఁ గూడి

విదితతత్త్వజ్ఞాన విద్యావిశేష,

సరసలీలాధిరాజద్రాజకీర

పోతమాంభీలబర్బూరభూజాత,

ధూర్మిమాలావిహారోజ్జృంభమాణ,

దుత్తారముల కాసతోఁ జేరుకొనునె

దేవులతోఁగూడి దివిజేంద్రుఁ బోలి, 'భూవలయంబెల్లఁ బ్రోచుచునుండు

మని యూరడిలఁబలికి, యాతని సెలవుఁ, గొని మీననాథుతోఁగూడి యథేచ్ఛ

జనులెల్ల నెలమి రాజ్యం బేలుచుండె

సారంగధరుఁడును జౌరంగియనెడు, పేరువహించి సంప్రీతి

బద్ధుఁడై సుఖలీల బ్రిచరింపుచుండె.

అని యిట్లు శాలివాహనశకాబ్దంబు,

టగు సౌమ్యనామసంవత్సరమున, దగ మాఘబహుళసప్తమియును దివిజ

గురువాసరమునకు గొదలె నీభక్తి,

శంభునిపేర దాక్షాయణీమాన, సాంభోజతరుణమార్తాండునిపేర

శివునిపేర శశాంకశేఖరుపేర,

నకలంకకీర్తివిహారునిపేర, సకలవేదాండపిచండునిపేర

దీనజనావనదీక్షావిధాన, మానితకరుణాసముద్రునిపేర

పరమాత్మపేర తాపసజనస్తుత్య, చరితునిపేర విశ్వప్రభుపేర

బుధజనాహ్లాదకాద్భుతమహాపుణ్య,

మహితుఁ డంచిత కూచిమంచివంశాబ్ధి,

తనయుండు తిమ్మసత్కవి రచియించి,

... ... ... ...

సంపూర్ణము.



# శ్రీ అముద్రితాంధ్ర గ్రంథ సర్వస్వము

సంపాదకులు,

కావ్యనిధి, శ్రీ చెలికాని లచ్చారావుగారు.



| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | జాహ్నవీమాహాత్మ్యము (ఏనుఁగు లక్ష్మణకవి) | | 0 | 10 | 0 |
| 2 | సీమంతినీకల్యాణము (పెనుమళ్ల సోమన్నకవి) | | 0 | 10 | 0 |
| 3 | విజయనందనవిలాసము (మంగళగిరి ఆనందకవి) | | 0 | 10 | 0 |
| 4 | వాల్మీకిచరిత్రము (రఘునాథభూపాలుఁడు) | | 0 | 8 | 0 |
| 5 | రంగనాథరామాయణము (కాచభూపతి, విఠ్ఠలరాజు) | | 1 | 0 | 0 |
| | శ్రీరంగమాహాత్మ్యము (కట్టా వరదరాజేంద్రకవి) | | 1 | 8 | 0 |
| 7 | సారంగధరచరిత్రము (కూచిమంచి తిమ్మకవి) | | 0 | 12 | 0 |
| 8 | చిత్రాడవేంకటేశ్వరశతకము (సంస్కృతము) | | 0 | 2 | 0 |
| 9 | శ్రీమదనగోపాలశతకము | ఇవి నీతిబోధకములగు శతకములు. | 0 | 2 | 0 |
| 10 | మహిజామనోహరశతకము | | 0 | 2 | 0 |
| 11 | వేంకటాచలనిలయశతకము | | 0 | 1 | 0 |
| 12 | నమశ్శివాయశతకము | | 0 | 1 | 0 |

అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము,
చిత్రాడ;
పిఠాపురంపోష్టు, గోదావరిజిల్లా.

# శ్రీ రామవిలాసగ్రంథమాలిక.

— నవలలు —

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 ప్రభాతము | 1 | 0 | 0 | | 10 రత్నపురి | 0 | 2 | 0 |
| 2 వినోదిని 1 వ భా. | 0 | 12 | 0 | | 11 మాయ | 0 | 6 | 0 |
| 3 వినోదిని 2 వ భా. | 0 | 12 | 0 | | 12 చాందసుల్తాన | 0 | 10 | 0 |
| 4 ప్రేమలత | 0 | 8 | 0 | | 13 చినరంగరావు | 0 | 6 | 0 |
| 5 మదనవేది | 0 | 8 | 0 | | 14 హాస్యచరిత్రము 1 భా | 0 | 8 | 0 |
| 6 మయసభ | 0 | 10 | 0 | | 15 పాణిగ్రహణము | 0 | 1 | 0 |
| 7 అపూర్వప్రతిభ | 0 | 10 | 0 | | 16 సహృదయ | 0 | 4 | 0 |
| 8 కాంచనమాల | 0 | 3 | 0 | | 17 తారాజీవితము | 1 | 0 | 0 |
| 9 రోహిణి | 0 | 2 | 0 | | 18 దోమాడయుద్ధము | 0 | 12 | 0 |

— ఇతర గ్రంథములు —

| | | | | | |
|---|---|---|---|---|---|
| 19 బద్దెనీతులు | | | 0 | 4 | 0 |
| 20 స్త్రీనీతిపద్యరత్నావళి | ... | ... | 0 | 4 | 0 |
| 21 రాయలరాజనీతి | ... | ... | 0 | 4 | 0 |
| 22 ఐరోపామహాసంగ్రామము | ... | ... | 0 | 2 | 0 |
| 23 కురంగము | ... | ... | 0 | 1 | 0 |
| 24 గోషా | ... | ... | 0 | 8 | 0 |
| 25 మల్లెమొగ్గ | ... | ... | 0 | 1 | 0 |
| 26 ఓటరులకర్తవ్యము | ... | ... | 0 | 2 | 0 |
| 27 విద్యావంతుని ధర్మములు | ... | ... | 0 | 2 | 0 |
| 28 సంక్రాంతిపంచిక (ఆంధ్రగ్రంథాలయ వార్షికోత్సవములు.) | | | 1 | 0 | 0 |
| 29 ఆంధ్రపరిశోధక మహామండలిచరిత్ర & ముద్రితాముద్రితగ్రంథముల పట్టిక | ... | ... | 0 | 8 | 0 |
| 30 హితవాది (విమర్శనము) | ... | ... | 0 | 0 | 6 |
| 31 సంగీతవ్యాసములు | ... | ... | 0 | 4 | 0 |
| 32 భగవద్గీతామృతబిందువు | ... | ... | 0 | 4 | 0 |
| 33 చమత్కారరత్నావళి | ... | ... | 0 | 4 | 0 |

వలయువారు— కార్యదర్శి:— శ్రీ రామవిలాసగ్రంథమాల,

చిత్రాడ, పిఠాపురంపోస్టు, గోదావరిజిల్లా.